వరుస నం¹ద "నమ శ్శివాయేతి" యనఁగఁ
జన "ననేన సదృశం జప్యం" బనంగ
ననుపత్తి "నంత్యజో వాఽగ్రజో వాఽపి"
యనఁ "బతితో వాఽపి" యన "యే స్మరంతి"
యన "జపతో వ్యాప్నుయా చ్ఛివం" బనఁగ
నకుటిలమూలపంచాక్షరీమంత్ర
మొకమాఱు సాలదే యుచ్చరించినను
ధర బ్రహ్మహత్యార్బుదంబు లడంచు
నురుశక్తి ²మఱియొంటి కున్నదే యనుడు
సర్వకృచ్ఛ్రాదులుఁ జాంద్రాయణములు
సర్వ³స్వ ధనదాన సత్క్రియల్ భూప్ర-
దక్షిణంబునుఁ దద్వ్రత ప్రచర్యలును
భైక్షాన్నములు దర్భపాలధారణము
⁴వెలయఁగా నేశ్రుతి విధియింపనేర్చు
నలఘు⁵తర బ్రహ్మహ⁶త్యాఘసమితి
నిదియ ప్రాయశ్చిత్త ⁷మిట్లయ్యె నేని
మొదలి వేదాగమ ముఖ్యకృత్యములఁ

౧. దు, ౨. యొండునకున్నదేయనుచు, ౩. ద్రవిణదాన ; ధర్మధురీణ, ౪. వెలియు, ౫. తీర, ౬. త్యార్బుదమున, ౭. మె.

## మహిమ ప్రకరణము

[౧]జను భాట్టీకృత సహస్రన్యాయవిధులు;
జన విహితాష్టాదశ స్మృతిక్రియలు
ధరఁ గుదృష్టముల మిథ్యల మెట్టులైన
ధర నెన్ని బ్రహ్మహత్యలు సేయరాదు
నిల నింతటన పాయునే [౩]యెన్ని [౪]మాటలు
లలరి "నమశ్శివాయ" యనంగరాదు
నెందైన నిటువంటి వెద్దినె ననిన
గొందిఁ [౫]గట్టుమునిన చందము ల్గలవె?
మెప్పాట వినఁబడ దిది గుదృష్టంబు
సెప్పకుఁడీ యప్రసిద్ధం[౬]బు విధులు
విధిపూర్వకం బగు విధి గల్గనేని
విధియిం[౭]పుఁ డొల్ల[౮]రే వినుచుండుఁ[౯]డనుచుఁ
బర[౧౦]గు దధీచి శాపంబుచేఁ జెడిన
చిరతమోవృత[౧౧]దుష్టచేతస్కులార!
మును గౌతముని శాప[౧౨]మున భ్రష్టులైన
* [ఘనతమోపహతసంగతచిత్తులార!

---

౧. జన, ౨. యూత, ౩. యిన్ని, ౪. మాటు, ౫. గట్టెను మను, ౬. ంపు, ౭. ంప, ౮. ఁడే, ౯. డనుఁడు; ననుచు, ౧౦. గ, ౧౧. దృష్టి, ౧౨. మునను భ్రష్టైన.

* కుండలులలోని పంక్తులు పూర్వముద్రణమున లేవు.

గూ[1]ఱి "న ద్వితీయోఽస్తి కుత్రచి" త్తనఁగ
ను[2]ఱిక "ఏకోరుద్ర ఉచ్యతే" యనఁగ
మునులయనాల్లింగ మని పల్కుచుండ
జెనసి జగంబులు శివునంద యడఁగుఁ
బాయక మఱి[3]యట్ల "పంచాక్షరేస్థి-
తా" యన నాజగత్ప్రళయకాలమునఁ
దలఁప "వేదాశ్చ శాస్త్రాణి" యనంగ
నిల "నుపమంత్రై రనేకధా" యనఁగఁ
దఱిఁదఱి శ్రుతులు శాస్త్రములు మంత్రములు
నెఱిఁ*"బుర స్తత్రైవ నిర్గతా" యనఁగఁ
బర[4]గుచు సకల శబ్దప్రపంచంబు
వచున నట్ల "యథా శివ స్తథా" యనఁగ
నడఁ[5]గు జనించుఁ బంచాక్షరియందు
నడ[6]రు తన్మహిమ యేమని ప్రస్తుతింప
నట్టిపంచాక్షరి యతులమహాత్త్వ
మిట్టిద యని మీర తెలియఁగక భ్రమసి
మదియించి పలుకు దుర్[7]తములు గాక
యది గుద్పృష్టం బెట్టు లనవచ్చు? మఱియు

---

౧. రు, ౨. ర, ౩. యు నప్పు, ౪. గిన, ౫. గ, ౬. ర, ౭. తులకు. * జన స్తత్ర వినిర్గతా.

నెనయఁ బంచాక్షరి యింత యేమిటికి
ననియొ యిది గుర్వష్ట మను[1]ట పెండియును
దండడి "బ్రహ్మహత్యాంచ" యనంగ
నంద "ఏతే ఘ్నంతి" యనఁగ నత్తుదిని
నత్రిఘ్నవర్ణంబునందు "సోమః ప-
విత్ర మత్యేతి"నా విశ్వైకజనిత-
మయిన యీశుఁడ "యుమయాసహావర్త-
త" యితి "సోమ" యనంగఁ దనరుఁ గావునను
బనుగొన సోమాం[2]క పఠనంబునం[3]దు
ననుపమం[4]బగు బ్రహ్మహత్యలు వా[5]యు,
నెనయఁ బంచాక్షరి యింత యేమిటికి
ననియొ యిది గుర్వష్ట మనుట వెండియును
బ్రతిభమై "యద్వ్యక్షరం నామ" యనఁగ
రతి "శివ ఇత్యక్షరద్వయం" బనఁగ
[6]శ్రుతి "య శ్శివేతి స్మరే త్కాశ్చి" దనఁగ
స్థితి "శివమేవానుచింతయే" త్తనఁగఁ
జని "య శ్శివేతి వాచం వదే" త్తనఁగఁ
దనరు నిత్యాదిసూక్తములు దలంపఁ
బాశుపతం బేల పఠికిఁ దొడుగ

౧. చు, ౨. కు, ౩. ద, ౪. బుగ, ౫. యు, ౬. ధృ.

# మహిమ ప్రకరణము

సి శివస్మరణ దా నేల హత్యలకు
[1]శివసమర్చనముఁ జేసినఁగాని పోని
శివనామ ముచ్చరించినఁగాని పోని
యంతపాతకము సేయఁగలేఁడు మనుజుఁ
డంతపాతకము నున్నదియు లేద[4]నఁగ
సిద్ధపంచాక్షరిచేఁ గాని పోని
బద్ధపాతకకోటి పంక్తు లున్నవియె
యొక్క విభూతియు నొక్క రుద్రాక్ష
యొక్క పాదోదక మొక్క నిర్మాల్య
మొక ప్రసాదంబును నొకసోమ[3]శరన
మొకభక్తదర్శనం బొక్కఁడొక్కండు
సకలభవంబులు సకలదుఃఖములు
సకల హత్య[5]లఁ బాపఁ జాలు నన్నట్టి
వచనంబు [6]లివిగావె "వచనాత్ప్రవృత్తి"
"వచనాన్నివృత్తి" రన్వచనం[2]బ కాన
నిఖిలధర్మాధర్మనిర్ణయోక్తములు
నిఖిలశివాధిక్యనిర్ణయోక్తములు
నవిరళాచార వర్ణాశ్రమంబు~~లును~~

౧. శివు, ౨. నిన, ౩. స్మరణ, ౪. [illegible], ౫. యం; లు, ౬. లనె కావె, ౭. బుగాన (౯).

వివరింప నవియును వేద[1]మూలములు
యవియు మీ[2]కెట్లు దా మనుమతంబయ్యె
నివియు [3]మా కనుమతం బెట్టులు గావు
భువి నిదానీంతనంబులో [4]సమాశ్లేయ-
[4]కవితలో [5]ప్రత్యక్ష కలితవాక్యములో
కతిపయ స్వసమ[6]య గతపాక్షికములో
[7]స్తుతిఫలంబులో ఫలశ్రుతులో కా[8]దేనిఁ
బూని శ్రౌతస్మార్త భూతసూత్రప్ర-
తానముల్ గావో యెత్తఱి నిషేధములో
నెఱియ [9]ధర్మాధర్మనిర్ణయంబు[10]లకు
మఱి లేదు వచనప్రమాణంబు గాన
నెఱియు శివాధిక్య నిర్ణయంబులకు
మఱి[11]యొప్ప వచనప్రమాణంబు[12]భక్తి-
మహిమఁ బ్రత్యక్షప్రమాణము లూన్[13]పి
మహితపంచాక్షరీమహిమ నిష్ఠింతు
జనులకునెల్ల దృష్టప్రత్యయముగ

౧. మోద, ౨. కెట్టుల గను, ౩. మీ, ౪. సమాశ్లేయ; యూరుషేయ, ౫. ప్రత్యక్ష, ౬. యగతిపాక్షి; యాగతసాక్షి, ౭. శ్రుతి, ౮. వే, ౯. శివాధిక్య, ౧౦. న, ౧౧. లేదు, ౧౨. గాన, ౧౩. ప.

ననుచు ముందఱి బ్రహ్మాహత్యాత్ముచేత
నుపవాస[1]ములు మున్న యునిచిన[2]యట్టి
కపిలధేనువునకుఁ గసవు [3]వైపింప
మొదవు[4]దా ముట్టక మూర్కొనకున్న
యదియ[5]ట్ల పె[6]ట్టు పాపాధిక నీవు
నలరి "నమశ్శివాయ" యనుచు శివుని
వలగొని [7]కస వింత వైచు నావుడును
వాయారఁగ "నమశ్శివాయ నమశ్శి-
వాయ" యనుచు[8]వాఁడు వచ్చి వైచుడును
నెదురుగా నేతెంచి యెప్పటికసవు
మొద వందుకొని మేసె ముదము దలిర్ప
సకలభూసురులు మస్తకతటన్యస్త-
ముకుళితహస్తులై మ్రొక్కంగ నంతఁ
బాటిగా నిజ్జగత్ప్రత్యయంబు[9]గను
దేటవడఁగ శివాధిక్యము మఱియు
శ్రుతిమూలమగు మహాస్తోత్ర మన్ కృతిని
ప్రతి[10]భ దలిర్ప సంపాదింపఁ[11]జెట్లు
కావున[12]మీఁదు [13]ప్రఖ్యాపితమహిమ

---

౧. ముల, ౨. మీఁద, ౩. వేయింప, ౪. నా, ౫. ట్లువె, ౬. ట్టి, ౭. మఱి మేఁత, ౮. నట్ల, ౯. నను, ౧౦. దలిర్పంగ, ౧౧. రె, ౧౨. నేఁడు, ౧౩. వి.

మావశం బగునె సమాఖ్య గావింప”
ననుచుఁ జో[౧]డనరేంద్రుఁ డంకింప నంత
ననఘుండు నో[౨]రుముక్కా-ళ్వారునంబి
“వనిత వరమనాచి వాటికామహిమ
జనులకునెల్ల దృష్టము సూపెఁగాన
యదియ వారాణసి, యదియ శ్రీశైల,
మదియ తాఁ గేదార, మది గయ, యదియ
యవిము[౩]క్తభూమి దా ననుచు నంబెన్న
వ్రవితతమహిమయుఁ బరమనాచిగృహ-
వాటికాస్థమహాత్త్వము జంగమంబుఁ
బాటిగా వివరిం[౪]చి పరమార్థమిదియ”
యనవుడు హర్షించి యాశివద్విజుని
వనిత “పుత్త్రులు నాకు వట్రిల్లిరేని
నంబిపేరిడుదాన నలి నెందత్తైన
నంబికాథవునాన” యనుడు జంగమము
మానంబి కరుణానుగ్రతఁ జేసి
పూని సత్పుత్త్రుండు పుట్టెడు ననుచు
లలి నాలలాము ఫా[౫]లమున విభూతిఁ
దిలకంబుగాఁ బెట్టి దీవించి చనుడు

౧. డా, ౨. నాఁగ, ౩. క్తి, ౪. ంప, ౫. లంబునభూతి.

మగువ[1]కంతన నెల మసలె గర్భంబు
మగువ యేరాలికి మసలె గర్భంబు
సతులకు నవమాస సంప్రాప్తిగాఁగ
సుతులుజనించి రుత్సుకత నిద్దఱకుఁ
[2]బెరియ[3]నంగయు నంబి పేరిడఁ దొడి-
తరుణి[4]యుఁ బతిఁగన్న తండ్రి పే రిడుడు
ననుదినవర్ధమానాంగు లై యింతఁ
దనయు లిద్దఱుఁ బెర్గఁ దరుణు లిద్దఱును
నొక్క[5]టఁ గావేరి యుదకంబులకును
జక్కనఁ దనయులఁ జంకలఁ బెట్టి
కొనిపోయి నదిదరిఁ గూర్చుండ డించి
తనుధర్మములకు నత్తరుణి లేఁగుడును
నంబియు ననుజుండు నలిఁ బ్రవాహోద-
కంబులఁ దరిఁ[6]జెర్లు గట్టియాడంగఁ
గసిమసఁగుచుఁ దీవ్రగతి నాబి నొక్క
మొసలి యేతెంచి సముద్ధతిఁ బట్టి
కొనిపోవ దరినున్న కొడుకు వాపోవ
విని యుల్కిపడి బలువిడివచ్చి నంబి

౧. కు సంతన, ౨. పి, ౩. నంబియు, ౪. యువతి, ౫. న-, ౬ జరు(ᐩ ; ట).

నా[1]క మొన లిడ్వంగ నువిద వీక్షించి
"యకటకటా!" యంచు "హా"యంచు గర్భ
మడఁచికొంచును "దేవుఁడా" యంచు నేలఁ
బడి పొరలుచు సుతుఁ బనవుచు వాయి
విడిచి యేడ్చుచును గావేరిలోఁ దాను
బడఁబోవుచును శోకపారవశ్యమునఁ
బొడిఁబొడిఁబొక్కుచుఁ బొగులుచు[2]న్నంతఁ
దొడరంగఁ బతియు బంధులు నేఁగుదెంచి
సంబరంబులు సేసి శైవో[3]క్తవైది-
కంబుగా నాముష్మికక్రియల్ సలుపఁ
"గను తెప్ప మూసైనఁ గనలేదు తల్లిఁ
దనయుం[4]డ! నిను బా[5]సి తరియింపఁగలనె?
చంక డిగ్గిన జీవి సనియెడు తల్లి
నింకిట నిను బాసి యేఁగంగఁ గలనె?
ప్రక్కఁ బాసిన భయపడియెడు తల్లి
నిక్కడ నిను బాసి యే నోర్వఁ గలనె?
వెన నిల్లు వెడలిన వెతఁబడు తల్లి
మొసలి కొప్పించి యిమ్ముల మనఁగల[6]నె?
నెట్టణఁ జెమటయే నెత్తురన్ తల్లిఁ

౧. ర; గ, ౨. నంత, ౩. క్తి, ౪. దు, ౫. రిథ, ౬. దె.

బట్టి నిన్బాసి యేఁ బ్రదుకంగఁ గలనె?
యన నేల వేయు నా[1] యన్న ! నేరంబు
నినుఁ బాసి నిలువంగ నేర్తునే?" యనుచు
నున్న పుత్త్రుని మనికి యునికియు రూపు-
సన్న పుత్త్రుడు నొక్క చందంబ కాన
యేరాలి సుతుమాట లెప్డు డాలిం[3]చుఁ
గూరిమి సుతుపలుకులు నడ్డ తలఁచు,
నేరాలి సుతు నెప్డు డీక్షించు నపుడ
గారాబుసుతునియాకారంబుఁ దలఁచు,
నేరాలి సుతు నెప్డు డెత్తి ముద్దాడు
నారంగ సుతు ముద్దులాటఁ దలంచు
మడఁతి వైరియనంగ మఱి యాక్రమమున
నుడుగని పుత్త్రవియోగదుఃఖాగ్ని
వందుచుఁ గందుచు వనరుచు నాత్మఁ
గుందుచు డయ్యుచుఁ గ్రుయ్యుచు సుతుఁ ద-
లంచి తలంచి ప్రలాపించు నవిద
సంచలమతినట్ల చరియింపనంతఁ
గడఁగి మఱఁదిసుతు గర్భాష్టకమున
వడుగుసేయంగ నవ్వటుకుమారుండు

౧. యున్న, ౨. బుగా, ౩. ంచ.

సరసరఁ జని నమస్కారంబు[1] సేసి
పెరియనంగను స్వర్ణభిక్షంబు వేఁడ
భిక్షంబుదీవించి పెట్టుచో[2] నతిక-
టాక్షంబు[3]లందు దుఃఖాశ్రులు దొరఁగ
నెక్కొన్నఁ[4] బుడిఁబుడినీరు గన్నులను
గ్రుక్కికొంచును సమాకులతఁ బొందుచును
నిచ్చట సుతుఁ[5]దల్చి యేడ్చినఁ దిట్టు
వచ్చునంచును గడువయు నొక్క[6]చుమ్మ-
యును గొంచుఁ గావేరియుదకంబులకును
జనుక్రియఁ జని తొంటి చక్కనిసుతుని
బనవుచు నేస్చుచుఁ బలవరించుచును
దనయుని బేర్కొని తఱిఁ[7]దఱి రాచి
"హానంబి! హానంబి! హానంబి! నంబి!
యోనంబి! యోనంబి! యోనంబి! నంబి!
నానంబి! నానంబి! నానంబి! నంబి!
యే నమ్మి యే నమ్మి యే నమ్మి చెడితి,"
ననుచు వాచఱవంగ నంతకుమున్న
యనఘుండు సంతతోద్యద్గుణస్ఫూర్తి

1. ఁజే, 2. డున, 3. నం, 4. జడినుడి, 5. ద్రవ్వి, 6. చుట్టు, 7. రాచిరాచి.

హతభవజార్తి దిగంతైకకీర్తి
గతనతజన సముత్కర సంశ్రితార్తి
గమనియ్య సకలజగద్వ్యాపవర్తి
ప్రమథేంద్రమూర్తి సేరమచక్రవర్తి
యొడయనంబిని సుమహోదాత్తయశుని
మృడ[౧]సమాహితదయామృత వార్ధిమగ్ను
సద్యఃప్రసాదభాస్వద్భక్తియుక్తు
హృద్యానవద్య మహిష్ఠచరిత్రు
నతులదృష్టప్రత్యయారూఢమహిము
రతిపతిసన్నుత రతికళాదక్షుఁ
బ్రత్యక్షకలియుగప్రమథగణేశు
నిత్యశివానంద నిరవధిసౌఖ్యు
వినుతసాక్షాద్విటవేషితరుద్రు
ననుపమగానవిద్యాపండితేంద్రు
విత్తేశసఖసఖు వీరసద్భక్త-
సత్తము సర్వప్రసాదసర్వాంగు
విస్మయాభిష్టుత విశ్రుతవ్రతుని
సస్మితముఖవికస్వరుని భాస్వరుని
శ్రీలింగపరికరు శివపదాచార్యుఁ

---

౧. సమున్వి(శ్చి)శ.

బాలితస్వసమయప్రథితప్రతాపు
సందర్శనము సేయఁ జనుదేర భక్త-
బృందంబు సెలఁగ నంబియు నెదురేఁగి
యన్యోన్య సందర్శనాన్యోన్యవినమి-
తాన్యోన్య వాగ్బంధురాలింగనాది-
సముచిత సవినయ సత్కారపూర్వ-
కముగఁ జేరమరాయగణనాథుఁ దోడు-
కొనిపోయి భక్తసంకుల సహితముగఁ
జెనసి లింగార్చనల్ సేయించుతఱిని
శీలసంపన్నుండు సేరమవిభుఁడు
"వాలుమా లింగంబు పళ్లెరంబునను
వడ్డింప[1]మికి [2]నొక్క వ్రతము" నావుడును
"వడ్డింపఁగారాని వ్రత మేమి" యనుచు
నంబెన్న లేచి విన్నప మాచరింపఁ
"బంబి యీశుఁడు వ్యాఘ్రపాదునిమ్రోలఁ
దాండ[3]వ మాడ నుదాత్తత వెలుఁగఁ
బాండురాంగుని యామ్య పాదదర్శనముఁ
గావించినప్పుడ కాని [4]వడ్డింప
మీవిధంబున బాస యిదివ్రతం" [5]బనుడు

---

౧. ంధనా, ౨. దగ దొక్క, 3. వంబాడు, ౪. యర్పింప,
౫. బునన.

నట్టిద కాఁకంచు నప్పుడు నంబి
సిట్టితాళము వ్రేసి చేయెత్తి మ్రొక్కి
తిరుపాట నీశుఁ బ్రార్థించి [౧]నుతించి
"యురుదయాంభోధి యిం [౨]దొక్క మా తేల
చిక్కక నిచ్చలుఁ జేరము మ్రోల
నొక్కొక్కమాఱు సెన్నొలయఁదాండవము
నటియించుచును శివనాథ మన్నాథ
పటుకాంతి వెలుఁగు నీపాదంబుఁ జూ[౩]పి
రక్షింపవే" యని రా[౪]యండుఁ దాను
నీక్షితి సాష్టాంగ మొఱఁగుడు శివుఁడు
నప్పుడు లింగపూజాంతంబునందు
నొప్పా[౫]రు [౬]నిజతాండవోద్ధతి నిలిచి
చేర[౭]మ [౮]మురజల ఝంకృతుల్ [౯]సెలఁగ
నారూఢవాద్య [౧౦]చూర్యాదులు మొఱయ
మ[౧౧]లువక చిణిచిణి మణిఘుర్ఘురములు
సెలఁగ నాడుచుఁ దీర్పుచేఁ గాలుసూప
మఱినంబియును జేరమయు భక్తతతియుఁ

---

౧. వేడుకను, ౨. దొంక, ౩. ప, ౪. యుండు, ౫. ర, ౬. నర, ౭. ము, ౮. యావుజి; యావజ, ౯. దనర, ౧౦. తూర్యా, ౧౧. లయక.

దటిఁదటి మ్రొక్కుచుఁ దద్వ్రతోద్యాప -
నం బాచరించి గణములు నేరమయు
నంబియు లింగార్చ[1]నంబు సెల్లించి
కడుఁబ్రీతి నిష్టలింగప్రసాదంబు
లడరభోగింపుచు నట్లహర్నిశము
శివభక్తితత్త్వగోష్ఠి ప్రసంగమునఁ
దివురుచుండఁగఁ గొన్నిదినములు సనియెఁ
జక్రవర్తియు నిజాస్థా[2]నంబు సన ను-
పక్రమించుడు నంబి నటుభక్తియుక్తి
వాహనవస్త్ర సువర్ణాభరణ స-
మూహాద్యభీష్టార్థ ముఖ్యవస్తువు[3]ల
రాజితకీర్తిఁ జేరమచక్రవర్తిఁ
బూజి[4]ంచి తద్భ[5]క్త పుంగవు లోను
ననుపంగ విచ్చే[6]సి యయ్యావలూరఁ
దనరారుఁ గావేరి దరి నొక్కశివగృ-
హోపకంఠమునఁ గొలువుండఁగ[7] నవల
వాపోవుచున్న యవ్వనిత యార్తార-
వంబును [8]హాహారవంబు నాలించి

౧. నమును జే, ౨. నికిఁ జన, 3. లు, ౪. ంప, ౫. క్తి, ౬. సేన, ౭. నపుడు; నంత, ౮. నాహా.

"నంబి ! యిదేమిరా నంబెన్న! నంబి !
చెడితిరా" యని యేడిచెడి నొక్కవనిత
గడుఁజిత్ర మరయుఁడు [1]గ్రమ్మన" ననుడు
దూతలు నని "యేల దుఃఖించె దిచట,
నాతి! యే[2]యూరిదానవు? నామ మేమి?
యెక్కడనుండి నీ వేతెంచి తిప్పు?
డిక్కడ నీ వేల యేడ్చెద?" వనుడుఁ
"బోదురుగాక మీ పోయెడి త్రోవ,
మా దిక్కరయ నేల? మాకును మీకుఁ
గారణం బేమేనిఁ గలదె? మే మాడు
వారము, బ్రాహ్మణవార, మ[3]ట్లయ్యు
నేకతం బొక్కతె యే నున్న యెడకు
మీకు వచ్చుడు ధర్మమే యేఁగుఁ" డనిన
'నోయమ్మ ! యేఁగక యుండెద మెట్లు?
వామొత్తి యేడ్చుచు వాచరచుచును
[4]బనవుచు నఱచుచుఁ బలవరించుచును
బనుఁగొన నెన్నుచుఁ బలుమాఱు నిట్లు
నంబి నంబెన యని నంబిఁ బేర్కొను వి-
ధం బేమి? యెక్కడితల్లివి? నంబి

---

౧. క్రమ్మర; క్రమమున, ౨. పూరి, 3. ట్లయిన, ౪. బనవుచు

యెక్కడిసుతుఁడు? [1]నిదేమియాశ్చర్య?
మిక్కుఁతయున్నట్టు తెలుఁగింపు' మనిన,
"హరు[3]ఁడు గుంటెనవుచ్చ నట వేయుమాడ
లకుదుగాఁ బడిగొను నటె యనుదినము
నంబి నా నొక్కగణం బంచు జంగ-
మ్మంబు సెప్పఁగ విని మరులొంద నంబి
పేరువెట్టితి నొక్కబిడ్డని, యట్టి
గారా[4]ముపట్టి యిక్కడఁ [5]జెర్లుగట్టి-
కొని యాడునట్టి [6]యెక్కుడు ముద్దుపట్టిఁ
గొనిపోయెఁ బుత్త్ర గ్రక్కునఁ [7]బట్టి మొసలి,
[8]నడపాడుప్రాయమున వఱుతఁగలసె,
నడరఁ బుత్త్రుఁడు సచ్చి మైదేఁడులయ్యెఁ,
గుంటెన[9]వుచ్చు మిక్కుటపు భక్తుండు
గుంటెన[10]వోవు మిక్కుటపుశంభుండుఁ
బడిఁ గొను నంబియుఁ బడివెట్టు శివుఁడుఁ
గడునర్థి నాసుతుఁ గావంగలే[11]ర;
తనపే[12]రినంబెన్నఁ దాఁ గావవలదె?

---

౧. నీవెక్కడితల్లి (డనంబి), ౨. డ, ౩. ని, ౪. ఫు, ౫. చరుల్; జర్లు, ౬. యిక్కువ, ౭. దిట్ట, ౮. నడచాటు (డు); నడుపాడు, ౯. బోవు, ౧౦. బుచ్చు, ౧౧. క, ౧౨. రు.

తననంబి నంబిగదా యని శివుఁడు
తననంబి నంబి మున్ దాఁ గావవలదె?
యన నేల నేయుఁ దా నది యట్టు లుండె,
వినుము నేఁ డే నేడ్చు విధముఁ జెప్పెదను:
నేఁడు నాయేరాలి నిజసుతు వడుగు
వాఁడు వాఁడును నొక్క వయసుగావునను
జెచ్చెర సుతుఁ డున్నఁ జేయనే నేఁడు
నచ్చుగా వడుగంచు నడలు పుట్టుడును
నచ్చోట నేడ్చుట యవినీతి గాన
యిచ్చోట నొక్కతె నేడ్చెద" నంచు
వృత్తాంత మంతయు వి[1]నుపింప దూత
లత్తఱి నంబెన్న కట్లు విజ్ఞాప-
నం బాచరింపుడు నంబి నవ్వుచు ర-
యంబున నప్పుడ యతివఁ దద్వరుని
వెసఁ బిలువఁగఁ బంచి' "విప్రుఁడ నొసలి
పసుపు[2] నక్షతలును బరి[3]కి[4] గడ్డంబుఁ
బసుపు జన్నిదముల పసుపు ని దేమి?
మెస[5]గంగ నింట నేఁ డేమి శోభన[6]ము?

౧. ని, ౨. బ, ౩. గి, ౪. గంధంబు, ౫. గుల, ౬. మొ.

నందను లెందఱు? నామంబు[1] లెవ్వి?
వందుచు నేఁడేల వనిత యేడ్చెడిని?"
ననవుడు "నేఁడు నా యనుజు ద్వితీయ-
తనయుని వడుగు, సంతానంబు లేక
పెద్దగాలంబు మా ప్రియభా[2]ర్య యుండ
నిద్దఱు జంగము లేతెంచి నంబి
నంబి యనుచు నొక్క నరుని గీర్తించి
యిం[3]బున బత్తి మా [4]యింటిఁ బైకొలిపి
పుట్టెడుఁ దనయుండు పుట్టెడు [5]నతనిఁ
బెట్టుఁడు నంబెన్న పేరంచు న[6]రుగఁ
బుట్టెఁ బేరిడుదునాఁ బుట్టెనో పుత్త్రుఁ
డట్టునుగాక దైవాధీనమునను
బుట్టెనో యెఱుఁగము పు[7]ట్టుచు నాతి
వెట్టె నా నంబెన్న పే[8]రంతె వాఁడుఁ
గావేరిలోఁ [9]జెర్లు గట్టియాడంగ
వావిరి మొసలి వే వచ్చి భక్షించె
మఱి లేరు పుత్త్రులు, మద్భార్య బ్రమసి
పెఱమనుష్యుని పేరు వెట్టిన నరుఁడు

---

౧. లేమి, ౨. మ, ౩. బనబి(గొ)ండి, ౪. యింటిపై, ౫. నంబి, ౬. డు, ౭. ట్టై, ౮. రె, ౯. జ(జె)రుల్.

## మహిమ ప్రకరణము

గావంగఁ బ్రోవంగఁ గలఁడె వాల్మీక-
దేవుని పేరేల ధృతిఁబెట్టోఁడయ్యొ?
హరుఁడుగుంటెనవోవు నటె, వేయుమాడ
లరుదుగాఁబడివెట్టు నటె, నంబి కట్టు
నంబియు గింబి వినాకి గినాకి
నంబిపేరిడ్డ తనయుఁ గావలేరె?
గొడ్డుపీఁగి కనినకొడుకు గారాము-
బిడ్డని మొసలి కొప్పించితిఁ గాక,
చెచ్చెరఁ గొడుకున్నఁ జేయనే నేఁడు
నచ్చుగా వడుగంచు నహరహంబునను
నది యాదిగా దుఃఖ మారద యింక;
నది యట్టు లుండె మా కరుగంగవలయు,
ధర శివద్విజుఁడ స్వాధ్యాయపరుండఁ
బరమపతివ్రత భార్య సద్భక్తి-
యుత, మిథునమునకు [౧]యోగ్యుల మేము
రతి నుమామాహేశ్వరప్రీతిగాఁగఁ
దగిలి పెట్టినయట్టి దాన మనంత
మగు "దాన మణ్వాపి చాక్షయం" బనఁగ
నను వు దీపింపఁ దా నర్థి నవ్విప్రుఁ

---

౧ ద, ౨. క్ష.

గనుఁగొని నంబెన్న గన్నుల నగుచు
"నీవు సెప్పినయట్ల భూవిబుధేంద్ర
భావింప నీకొండు పాన లేమిటికి?
నంబి నంబియ నీతనయు మన్నె నేని,
నంబి గింబియ నీతనయు మన్నఁ డేని,
నానంబి శివునంబి యయ్యె నేనియును
నానంబి[1] పతి శివుఁ డయ్యె నేనియును
హరుఁడు గుంటెన వోవు డది దథ్యమేని
హరుఁడును బడివెట్టు డది దథ్యమేనిఁ
బంబి నీ తనయుండు బ్రదికెడుఁ గాక!
సంబరపడ నేల? చర్చింప నేల?
నంబియుఁ గలిగి పినాకియుఁ గలిగి
సాంబసద్భక్తి మహత్త్వంబుఁ గలిగి
నీయగ్రసుతుని సన్నిధియుఁ గల్గినను
జేయుఁ దా వడుగుఁ జెప్పెర నేఁడ" యనుడు
"వత్తురే చచ్చినవారిర లేనాఁట
నుత్తములకు నిట్లు యోగ్యమే బొంక
భవభక్తిపరుఁడవు భాగ్యవంతుఁడవుఁ
దవిలి మఱుఁగింప ధర్మమే నీకుఁ

1. నంబినంబ, 2. రు నే.

బాలుపుగా నారిన పుం[1]డ్లఁ గోలలను
గె[2]లఁకిన క్రియఁ గెలఁకెదు సుతుచావు,
వలదు నీ[3]వడఁకింప వారక మమ్ముఁ,
బిలుపించి దానంబు వెట్టవే[4]నదియు
దేనికి రప్పించితి[5]వి మహాపురుష!
దీనుఁడమని యేము ధృతిమా[6]లి చెదవు,
మును మహాదేవుని ముట్టంగఁగొలిచి
యనుభవించెద [7]వైహికాదిభోగములు,
ఘనుఁడ మమ్మిట్లాడికాని యీవింక
ననుభవిం[8]పవె మీఁద నపవర్గసుఖము?
వేయేల నీయీఁగి వేయును వచ్చెఁ
బో[9]మెద"మని తాను బోఁతియుఁ బోవ,
"భూసురోత్తమ! యేల పోయెద వింక
నీసుతు పేరుగొనిన నంబి నేన,
హరునిగుంజెనవుచ్చు నానంబి నేన,
హరునిచేఁ బడిఁగొన్న యానంబి నేన
మొసలి మ్రింగినయట్టి ముద్దుఁదనూజు
నసలార రక్షించు నానంబి నేన,

---

౧. ండు, ౨. లి, ౩. వుడి(ది), ౪. యా(యి)దె, ౫. వె, ౬. ని, ౭. సై, ౮. తము; పవు, ౯. యే.

మొసలి పుత్త్రుని దిన్న మును తేవునకును
మసలక పనుపు నీ మగువ నీక్షణము,
బూతనూభవు నాఁడు మ్రింగిన మొసలి
యేతెంచి సుతుఁ గ్రక్కి యేఁగెదు, నేఁడ
చేయుము వడు గభిజిత్కాలమున స-
మాశ్రియతంబుగ సుతు" నంచు నర్థంబు
గమియనిచ్చుడుఁ బులకలు మేనఁ దోడరఁ
బ్రమదాశ్రు లడర సంభ్రమలీలఁ గ్రాల
నలరుచు సాష్టాంగు లగుచు మ్రొక్కుచును
నలిఁ జెలంగుచు నమున్నతి మిన్ను ప్రాఁకి
యుపనయనోద్యుక్త యుక్తిమై విప్రుఁ
డపరిమిత ప్రీతి నరిగె నింటికిని;
సతియుఁ బుత్త్రోత్సవాసక్తిమై నరిగె
సుతుని మొసలి దిన్న చోటికి, నంత
నానంబియును ననంఖ్యాత మాహేశ్వ-
రానీకమునకు సాష్టాంగుఁ డై సహజ-
శంభుండు సేరమచక్రవర్తుల ప-
దాంభోరుహోత్తంసుఁ డై తదీయాజ్ఞ
నాలింగమూర్తి నయ్యా! యని పిలిచి

---

౧. డు, ౨. యుతం బగు.

తాళములు వ్రేసి సప్తస్వరోదాత్త-
బంధురధ్వనిఁ దిరుపాటఁ గీర్తింప
సంధించి శివునిఁ బ్రసన్నుఁ గావించి
"మొసలి యాహుతి గొన్న ముద్దుఁదనూజు
నొసఁగవే యసమసముద్యద్దయాబ్ధి"
యంచు విన్నప మాచరించుడు న య్యు-
దంచద్దయాకరుం డంతకుఁ దలఁప
నంత నయ్యంతకుం డంతంత మ్రొక్క-
నంత కాంతకుం "డోరి! యంతక! మొసలి
దినినతనూజుఁ డెద్దివి నున్నవాఁడొ
కొనిర[3]మ్ము" నాఁ జిత్ర[4]గుప్తుండు "నీదు
భృత్యుండు నంబెన్న పే రాటఁ[5]జేసి
నిత్యసాయుజ్యసాన్నిధ్యముఁ బడసి
యున్నాఁడుగాని వేఱొండులోకముల
న న్నందనుండు లేఁ" డని విన్నవింప
బ్రహ్మఁ దలంచుడుఁ బ్రణమిల్లుఁ డగుచు
బ్రహ్మయు [6]రెండేండ్ల ప్రాయంబునందు
రయమున గ్రాహోదరంబున జీర్ణ

---

౧ ంచి, ౨. క్షి, ౩. మ్మ, ౪. గుప్త (ప్తు) తృతీ (త్వదీ) య, ౫. యొరిగి, ౬. మూఁడే.

మయిన యర్భకుని నధ్యయనవచస్క-
౧గర్భాష్టకప్రాప్తుఁ గావిం౨చి మొసలి
గర్భంబునం దిడెఁ గావేరిలోన
నుదకమధ్యంబున నున్న కాగ్మొసలి
యుదరంబునన పుత్త్రుఁ డుదయింపఁ గాలుఁ
డరిగి "నీయుదరంబునం దున్నయట్టి
వరపుత్త్ర రప్పింపు వారక" యనుడుఁ
గొనసిరక మొసలియు గొబ్బునఁ బొడచి
యసమనదీప్రవాహమున కెదుర్చ
'నదె వచ్చె ౩వచ్చె' నా నక్కుమారుండు
వదనగహ్వరమున వ్యక్తి భజింపఁ
గడు నొప్ప గర్భాష్టకప్రాప్తుఁ డైన
కొడుకుఁ దత్తటమునఁ గొనివచ్చి దింప
నుద్ధతి నాయావలూరి యాబాల
వృద్ధాదు లటమున్న వీరు వారనక
కావేరితటమునఁ గట్టలు గట్టి
భావిం౪చి విస్మయపడఁగఁ దత్సతియు
నల్లంత సుతుఁ గాంచి హర్షించి మించి
యుల్లంబు దళుకొత్త నురువడి ౫నెయిది,

---

౧. ప, ౨. ల, ౩. గ్రుక్కన నాకు, ౪. ప, ౫. నెగిడి; నేఁగి.

"వచ్చితా నంబెన్న ! వరతనూభవుఁడ !
వచ్చితా నంబెన్న ! వడుగ ! నాయన్న !
నా[1]కున్న ! నాపట్టి ! నను గన్నతండ్రి !
నాకుమారుండ ! రా నాకుఱ్ఱ !" యనుచుఁ
గూర్మి నెక్కొన నెత్తికొని కౌఁగిలించి
యర్మిలి నందంద యప్పళించుచును
జనుఁగవఁ దొరఁగు స్తన్యధారలను
గనుఁగవ హర్షాశ్రుకణపూరములను
జెన్నార సుతు నభిషిక్తుఁ గావించు-
చున్నయత్తఱిఁ బతియును నేఁగుదెంచి
సుతుని గౌఁగిటఁ జేర్చి సూరెలజనులు
నుతియింప సతియుఁ దానును దనూభవుఁడు
నరుదొంద నంబి పదాంబుజంబులకు
వరుసఁ జేరమచక్రవర్తికి మ్రొక్కి-
యొనరారు సూక్తి "గ్రాహోదరజీర్ణ"
మనఁగ "నంతకముఖాదానీత వా" న-
నంగ మొసలికడుపునను జీర్ణమైన
[2]పింగలి నొకవిప్రు ప్రియపుత్త్రు నంబి
నొనర నంతకముఖంబునన రప్పించి

౧. కూన, ౨. పెంగలి.

కనియెఁ గేవలభక్తగణనిధి మఱియు
హరి గరుడారూఢుఁ డై సుదర్శనము
ధరియించి వైష్ణవోత్తమభటు ల్గొలువఁ
జంబి తత్సూక్తి "స్వార్చాంబుజగ్రాహి-
ణం" బని మ్రోయ స్వార్చాంబుజగ్రాహి
యవు గజేంద్రు మొసలియట్లు వట్టుటయుఁ
దవిలి విష్ణుండు యుద్ధం బాచరించి
కాని గజేంద్రుని గావంగ లేఁడ,
యీనంబిమహిమ మే మేమందు మనుచుఁ
గ్రచ్చఱ నట మున్న గ్రాహోదరంబు
సొచ్చినయప్పుడు వచ్చినజముని
[1]పుచ్చినఁ బ్రాణంబు వచ్చిన దనియుఁ
దెచ్చిన పుత్త్రుని వచ్చిన విప్రు
నెచ్చిన వనితకు నిచ్చిన నంబి
[3]నెచ్చినమహిమకు మెచ్చిన బుధుఁడు
విక్రమభక్తి నిర్వక్రక్రియా ప-
రాక్రమ[4]క్రముఁడు సేరమచక్రవర్తి
విశ్రుతాసంఖ్యాత వీరమాహేశ్వ-
రశ్రేణియును [5]నుబ్బి ప్రస్తుతింపఁగ స-

౧. హ, ౨. చ, ౩. వి, ౪. భుజుఁడు, ౫. నంబి.

మ స్తమానవులును మ స్తకన్య స్త -
హస్తులై జయవెట్ట నంత నాద్విజుఁడు
"నంబి! నంబెన్న ! యానందస్వరూప !
నంబి ! నంబెన్న ! యున్నతజగద్దీప !
కత లేల మీధర్మకవిలెల మేము
గతియును మఱియు నేడ్గడయు నీ వన్న
దాన మొక్కటి వేఁడఁ దనకు సత్పుత్ర-
దాన మిచ్చితి మహోదాని ! మహాత్మ !
దేవ ! భవన్నామధేయుని నంబిఁ
గావుము ప్రోవుము కరుణాబ్ధి !" యనుచుఁ
దివిరి ద్విజత్వంబు ద్విజుల కేలనఁగ
నవనీసురోత్తముఁ డాశ్చర్య మెసఁగ
నంబెన్నయాజ్ఞాపనంబునఁ జిన్న-
నంబి కప్పుడ యుపనయనంబు సేసె,
"నిత్రయి నంబి మహిమ్మత మఱియుఁ
జిత్రంబు వేయును జెప్పనే" లనుచు
నఖిలభక్తానీక మంకనల్ సేయ
సుఖలీల మల్లికార్జునవిభుఁ డంత

ధవళేశ్వర చరిత్ర కథనము

గణములు[1]కును దృష్టిగాఁ [2]బర్వ మపుడ
యొనరంగఁ జేయించి యుచితముల్ దనర
వరవస్త్రభూషణావళులఁ బూజించి
యరయంగ గంధపుష్పాదులఁ దనిపి
కర్పూరసహితంబుగా [3]వీడియంబు
లర్పించి భక్తిసమగ్రత [4]మెరసి
యానందగీతంబు లర్థిఁ బాడుచు శి-
వానందలీలల నలరి యాడుచును
శంకరగీతముల్ సర[5]సఁ బాడుచును
శంకరలీలల జ[6]తులకాడుచును
బరమశివానందభరి[7]తుఁ డై మఱియు
హరగ[8]ణంబుల యున్న యవసరంబునను
బటుభక్తిఁ గర్ణాటభాష యర్థించి
యటమున్న బసవదండాధీశుకడకుఁ
బుచ్చిన జంగమంబును భక్తవరులు
వచ్చి యా బసవన్న [9]వరమహత్త్వంబుఁ
బ్రస్తుతింపుచు సమర్పణ సే[10]యు బసవ-

౧. క, ౨. స, ౩. వి, ౪. దనర, ౫. వి, ౬. జా, ౭. తమై, ౮. ణాగ్రణులు, ౯. ప, ౧౦. యు.

హాస్త్రానుగతభూతియందు నంతటను
గర్ణాటభాష సాంగముగఁ బ్రాణేశుఁ
గర్ణాటగీతసంగతులఁ బాడుచును
మఱియును బసవయ్య మహిమలు వినుచుఁ
దఱిఁదఱి బసవన్నఁ దలఁచి మ్రొక్కుచును
వినుకలిసుఖము సిల్విలివోవునంత
గనుక[3]లి[4]నాత్మ ముంగలి దొంగలింపఁ
బాపక్షయాత్రియ్య బసవాక్షరత్ర-
యోపలాలన పరనోన్ముఖి మనుజ-
రక్షణాపేక్షుఁ బ్రత్యక్షత్రిచక్షుఁ
ద్ర్యక్షప్రసాదపంచాక్షు సాక్షాస్త-
హాక్షు ఫాలాక్షప్రయుక్తఫాలాక్షు
శిక్షితప్రతిపక్షు శివభ[5]క్తిదక్షు
నక్షీణకరుణాకటాక్షవీక్షణ సు-
రక్షిత స్వసమయపక్షు నానత ము-
ముక్షు సంస్కృతపాశమోక్షు దుర్జనప-
రోక్షు సితరౌరరుద్రాక్షవిహిత-
పక్షుఁ గ్రియాదక్షు దక్షమహాధ్వ-
రక్షయరక్షసదృక్షు జంగమస-

---

౧. న, ౨. య్య, 3. ని, ౪. కా, ౫. క్త.

మఱియు బసవగణాధ్యక్షు నతుణాము
వీక్షింతు ననువింత వేడ్కమై నంత
స్ఫుటకీర్తి మల్లికార్జునుఁడు కల్యాణ-
కటకంబునకు నభి[1]గమనంబు సేయ
మూరారిసద్భక్తమండలి దాను
నూరూర సద్భక్తు లోఁగి నెమరొక్కనఁగ
మ్ముదమున నిరుగుడుములకు నేతెంచి
సదమలా[2]త్ముఁడు వీరచాకి[3]రాజయ్య
ప్రవ్యక్తభక్తి సారంగేశు నంద
నవ్య[4]సీమాలంఘనవ్రతాసక్తి
నతులత్రికాలలింగార్చనా[5]యుక్తి
సతతజంగమపరిచర్యానురక్తి
శివ[6]భక్తితత్త్వ గోష్ఠీసముద్యక్తి
యవధూత పూర్వవర్ణాశ్ర[7]మవ్యక్తి
శ్రుతిచోదితాచార సుపథప్రయుక్తి
మతిఁ గొనియాడుచు మఱిపండితుల ని-
జాగ్రశిష్యుండన నమరు [8]దోనయ్య
కగ్రజుండై వ్రతోద్యన్నిష్ఠ వెలయ

---

౧. గమ్యంబు, ౨. త్మలు, ౩. దేవయ్య, ౪. శివా, ౫. స, ౬. భక్త; తత్త్వ, ౭. వ, ౮. దోనమయ.

నావీరచాకి[౧] రాజయ్యచే భక్తి-
భావనమైఁ బ్రణిపత్తిఁ గైకొనుచుఁ
గర మనురాగసంగతిఁ బూనుగంటి
కరుగుదేరఁగ శిష్యుఁ డైన బండరువు-
గోవిందప్రెగడయుఁ గోరి[౨] మహేశ్వ-
రావలియును బురం బభిరమ్యముగను
నెల్లెడఁ జాళియం బిప్పించి రంగ-
వల్లులు వెట్టించి వాడవాడలను
ముకుళపల్లవమణి ముక్తాఫలాది-
మకరతోరణములు మార్గపార్శ్వముల
నుప్ప[౩]ర[౪]వట్టంబు లొాగిఁ [౫]గప్పడములు
నుప్పరగుళ్లు మహోక్షుపతాక-
ములు వాతపూరణంబులు నాతపత్ర-
ములు నలంకారించి మొత్తము ల్గ్రాఁ[౬]గ
[౭]నిద్ధవాద్యధ్వను లెల్ల ఘూర్ణిల్ల
శుద్ధ[౮]సాళగగీత సూ[౯]ళాదు [౧౦]లులియ
నంతంతఁ గోలాట లంతంత[౧౧]జోఁక
లంతంతఁ గేళిక లభినయింపంగఁ

---

౧. దేవయ్య, ౨. మ, ౩. న, ౪. వంటంబు, ౫. గల్ప, ౬. క, ౭. యి, ౮. తాళగ; సాగర, ౯. లా, ౧౦. లాలయు, ౧౧. బో.

జాంగుభళా! యంచు శబ్దముల్ మ్రోయ
పీఁగుచుఁ బురజనుల్ విభ్రాంతులుగను
గోవింద[1]ప్రై[2]గడయు గురుపాదసరసి-
జావలోకనవంద నావసానమున
నంత ననంతసాష్టాంగంబు లిడుచు
సంతతోత్సవలీల స్వర్ణపాత్రములు
భ్రాజిల్లు దివ్యాభరణసమూహములు
రాజిత [3]కనకాంబరప్రతానములు
నానాఫలంబులు నానాప్రసవవి-
తానంబులును సుగంధద్రవ్యములును
గర్పూరసహితంబుగా విడియంబు
లర్పించి మఱియు సాష్టాంగుఁడై మ్రొక్కి
యానందజలముల నడుగులు గడిగి
పూని స్వకీయహృత్పుష్పంబుఁ బూన్చి
సతతసద్భక్తి వాసనధూప మిచ్చి
నుత[4]సంస్తవనవాఙ్మణుల నివాళించి
తనుమనో[5]రథనివేద్యంబు లర్పించి
వినుతానురాగ మవ్విడియంబు నిచ్చి
నుత నవరత్నసంగత హేమసల్ల-

౧. ప్ర; పె, ౨. గ, 3. దివ్యాంబ, ౪. సంస్కరణ, ౫. ధన.

లిత పుష్పపుష్పాంజలి త్రయం[2]భక్తి,
క్రమమొందఁ [1]గురుపదకంజంబు లి[3]ట్లు
సముద్ధితాత్మాంగ చేష్టలన భజించి,
యధిగతప్రాణ దేహార్థముల్ భక్తి-
విధి "సద్గురుభ్యో నివేదయా" త్తన ని-
వేదించుచును నట్లు వినమితుండగుచు
నాదట దర్శింప నలని యన్యోన్య-
సందర్శనాన్యోన్య [4]సంస్తవాన్యోన్య-
వంద[5]నాన్యోన్యవివశచిత్తు లగుచు,
నంతఁ బండిత మల్లికార్జున[6]ప్రభుని
గంతుసంహా[7]రభక్తగణసమూహంబుఁ
దోడ్తెరఁ బండితేంద్రుండు నప్పురికి
నేడ్తెరఁ దళుకొత్త నేతెంచునెడను
బుణ్యాంగనలుఁ బుణ్యపురుషులు నెరవి
గణ్యసద్భక్తైకగణ్యు జగద్వ-
రేణ్యు సద్గుణమణిపుణ్యు వీరాగ్ర-
గణ్యు సన్నిహితకారుణ్యు సజ్జనశ-
రణ్యు విధూతకార్పణ్యు నగణ్య-

౧. బొసగి, ౨. గుర్వంఘ్రి, 3 ట్ల, ౪. పన్నుత, ౫. నా
నంద, ౬. విభు, ౭. రు.

పుణ్యు నానతకృతపుణ్యుఁ జూచుచును
మస్తకవిన్యస్త హస్తాబ్జు లగుచుఁ
బ్రస్తుతింపఁగ నరపతి విని మ్రొక్క-
న్వాచ్ఛ సద్గురుభక్తి సంపద మెఱసి
"గచ్ఛతః పృష్ఠతో గచ్ఛే" త్తనంగ,
లలి "గురోశ్ఛాయాం నలంఘయే" త్తనఁగ,
మలువక "గచ్ఛేన్నమస్కృత్య" యనఁగ,
ముంగల నిజ గురుమూర్తి యేఁగంగఁ
బింగ[3]ళి గోవిందప్రెగడ దచ్ఛాయఁ
ద్రొక్కక దాఁటక త్రొక్కినచోటఁ
ద్రొక్కక దాఁటక తొలఁగి మ్రొక్కుచును
నంతంత మఱియు సాష్టాంగంబు లిడుచు
నంత స్వకీయ గృహాంతరంబునకు
గురునాథుఁ బ్రీతిఁ దోడ్కొనిపోయి యచట
నురుతరసింహాసనోపేతుఁ జేసి
స్వామి శ్రీపాదమజ్జన మాచరించి
శ్రీమతి పాదాంబుసేవనుఁ డగుచు
ఖ్యాపితభక్తి నతులగంధపుష్ప-
ధూపదీపాదు లుద్యుక్తి నర్పించి

౧. త్రొ, ౨. రచ్ఛా, ౩. ల; ళి.

నలి "స్వగృహం స్వధనం చైవ" యనఁగఁ
గలయంగఁ దమయింటఁ గలయంతవట్టు
ధనము ధాన్యంబు గోధనము వాహనము
లనుపమ చీనిచీనాంబర ముఖ్య-
వివిధాంబరావళుల్ వి[2]శ్రుతానర్ఘ-
నవరత్నఖచిత నానావిధాభరణ-
ములు[1] సుగంధద్రవ్యములు నటుగూడ
నిలుసూఱగా [3]భక్తి నెలమి నర్పించి
యంత గురుప్రసాదాబ్ధిఁ దేలుచు ని-
రంతర భజనానురక్తి నర్పింప
నిచ్చలు శివభక్త నివహాలయముల
నచ్చుగా దేవకార్యములు విభూతి-
వీడియంబులు[4]ను వివిధదీక్షలును గ-
ణాడంబరములు మహాపురాతను[5]ల
పండు[6]వుల్ వర్వముల్ వాటిజాతర ల-
ఖండితంబులుఁ గేళికలు నుత్సవములుఁ
జలివిలివోవంగ శివతత్త్వగోష్ఠి
నలరుచుఁ బండితయ్యయు భక్తవరులు

---

౧. తముఖ్య, ౨. ను, 3. నప్పుడె, ౪. వీరవివిధదీక్షలుగ, ౫. లు, ౬. గ; గుల్.

ననయంబు భక్తిసుధా[౧]రసాపార-
వన[౨]నిధి నోలాడుచు వర్తింపుచుండ
మహీ ధవళేశు నామయ్యగా రంద
సహజైక లింగనిష్ఠావృత్తి న[౩]డవఁ
దనతోడి లెంక[౪]లుగని యసహ్యమునఁ
జని "యుదయావనీశ్వర ! నీదు పెద్ద-
లెంక నామన మిమ్ము లెక్కసేయండు,
గొంకక పెట్టించుకొనియు మీతమ్ముఁ
బాఱంగవైచుఁ దా భక్తుండ ననుచుఁ,
జీఱిన రాఁడు, నిన్నేరి కొల్వండు,
పండితేంద్రు[౫]నియొద్ద భక్తులయొద్ద
నుండు నిన్నటఁగోలె నో[౬]రంత ప్రొద్దు,
[౭]నమ్మవేఁ జూడు భూనాథ ! నేఁ"డనుఁ[౮]డు
నమ్మహీశుఁడు "నామ ! ర"మ్మని పిలిచి
కొమ్మిచ్చటనె యంచుఁ దమ్మవెట్టుడును
[౯]దమ్మభూమీశు నొద్దన పాఱవైచి
వరగురుధ్యాన పూర్వక భస్మలిప్త-

---

౧. మృతా, ౨. నిధిఁదేలుచు, ౩. డు, ౪. లెంతయూనసహ్యము (ము)నక్రె లుగలియసహ్యమున, ౫. ల, ౬. కె, ౭. నమ్మతే (నే), ౮. చు, ౯. దమ్మి.

కరతలుం డగుచు స్రుక్కక పతిఁ జూచి
"తగవగు సేవకధర్మంబుఁ దలఁప
నొగిఁదమ్మకైనఁ జేయొగ్గనే కాక
తగునె కేవలభక్తి ధర్మంబుఁ దలఁప
మొగిఁ బ్రసాదేతరంబునకుఁ జేసాఁప?
నర్పింపఁగారాదు హరున కీతమ్మ,
నర్పితేతరవస్తు వది గొనరాదుఁ,
జోళవాళి[1]కకాక క్షోణీతలేశ
వేళవాళికిఁ గర్తవే? యటు[2]లైన
స్వార్థజంగమపూజనార్థ మీయర్థ
మర్థసంఘటనార్థ మది నీదుసేవ
యరయఁ దత్సేవార్థ మంగవిక్రయము,
ధరణీశ! యటుగానఁ దనశరీరంబు
నమ్మినవాఁడఁ గా కాచార[3]నియతి
నమ్మినవాఁడనే" యనవుడు నృపతి
మదిఁ గోపమను చిచ్చు మదమను గాలిఁ
బొదలుచుఁ దరికొన్న భూమీశుఁ డంత
నుడుకుచు "[4]నేమేమి యోరోరి! నామ!
పడవైచితివి దమ్మ భక్తుండ వనియొ

---

౧. కిఁగా, ౨. లనిన, 3. వితతి, ౪. నంతంతయో.

ధ్రువము నీకొలఁదిభక్తుల యిలాస్థలిని
నవనీశునకు బంటులైయున్నవారు,
దమ్ములుదినువారుఁ దమ్మిచ్చువారు
నమ్మినమంత్రులై న[1]డచెడువారుఁ
బానలొండేల మీబసవరాజాది-
గా నడవ[2]రె సేవకప్రకారమున?
భువి వారికంటె నేపొల్పు నీవొక్కఁ
డవయుఁ గడపరానియట్టి భక్తుఁడవె?
లెంక!నామన!భక్తిబింకంబు [3]లుడుగు,
కొంకకు మీసారెకును దప్పవట్ట
నేచి[4]మైయెఱుఁగక యిలఁ దమ్మఁ బాఱ-
వైచిన తప్పు మైవడి సహించితిని,
రా! యింద! కో! తమ్మ, రతినొల్లవేని
మాయొడల్ మాకిమ్ము మాటలే"లనుడుఁ
"గొలిచిన నెపమునఁ గొసరక [5]నన్నుఁ
బలికిన భూమీశ! పలికితిగాక
యనఘుల నవిరతానన్య శరణ్యు-
లను భక్తగణనాథులను బల్కఁ జన్నె?

౧. డిచెడి; డిచిన, ౨. ర, ౩. లి, ౪. మెయ్యె, ౫. తన్ను; యున్న.

కొలుతురే భవుల భక్తులు, గొల్చి రేనిఁ
గొలిచిరిగాక లోకులయిండ్ల బంట్లై?
సద్గురులింగప్రసా[౧]దము వాప-
తద్గత చిత్తుల తమ్మలు దిండ్రె?
యిష్టలింగప్రసాదేచ్ఛానుభవులు
గష్టమానవుల యుచ్ఛిష్టముల్ దిండ్రె?
సంగతలింగ ప్రసాదైకసుఖులు
తెంగి మనుష్యుల యెంగి[౨]ళ్లు [౩]దిండ్రె?
బసవయ్య గొలువఁడే భవు ననియెదవు,
బసవయ్యమహిమ యేర్పడ నెర్గ వీవు,
వసుధకు సద్భక్తివర్ధనార్థముగ
బసవని శంభుండు [౪]వంచునత్తఱిని
స్ఫటితులాయష్టి సంపుటభూషణాదు
[౫]లిటఁ[౬]గల్లై లేక యెత్తెఱుఁగంగరాదు,
వరపూర్వ శుద్ధసు వ[౭]ర్ణాంతరంబు
నొరగల్లు లేకున్న [౮]నొగినెర్గ రాదు,
శోణపాషాణవిస్ఫూర్తి ఘర్షించు
శాణంబు లే[౯]కున్నఁ జన దట్టుఁగాక,

౧. దముల్, ౨. ంబ్లు, ౩. దివిరె, ౪. పనుచు, ౫. తె, ౬. ట్లు, ౭. ర్ణోత్త, ౮. నెఱుఁగంగ, ౯. కెఱుఁగ.

మ్రొంకచే నీడ, మయిలలచే మఱుఁగుఁ,
జండిచే శూరుండు, జారచే సాధ్వి,
ఖలునిచే బుధుఁడు, దుఃఖముచేత సుఖము,
నలుపుచే గౌరవర్ణముఁ, బ్రపంచంబు-
చేఁ బరమా[1]త్మైకసిద్ధి, పాపంబు-
చేఁ బుణ్యసంప్రాప్తి, [2]సేఁతిచేఁ దీవు,
నీతుచే నుష్ణంబుఁ, జీకటిచేత
జ్యోతి, యసత్యంబుచేత సత్యంబు,
భవిచేత భక్తుండుఁ బరు[3]వడి మెఱయు
పవిదిని బసవయ్య పటుమహత్త్వంబు
గుఱియైన [4]బలుదూషకుని చేతఁగాని
మెఱయదంచుఁ దలంచి మృడుఁ డక్షణంబ
కంటకాసురుఁడనఁగా నొక్కదివిజ-
కంటకుఁ బ్రతిపక్షుఁగాఁ బంప, నసుర
పృథివిపై జనియించి బిజ్జలుఁ డనఁగఁ
బ్రథితబల్లహపట్టభద్రుఁడై యంత
నెసఁగఁ గప్పడి సంగమేశ్వరంబేఁగి
బసవయ్యఁదోడ్తెచ్చి బండరువిచ్చి

---

1. త్మై, 2. జెంపుఁ జెందింపు (జేదేవు), 3. పంగముటి,
4. పటు.

యసమ సకలనియోగాధ్యక్షుఁ జేయ
బసవయ్యయును లసద్భక్తిసంయుక్తి
*సరిఁ[1]బేర్చి జంగమార్చనలు సేయుచును
నరపతిరాజ్యంబు నడపుచునుం[3]డుఁ,
బలియుఁగదాయని పనియేమియనఁడు,
ధృతిఁదక్కఁ జేయఁడు దేవువిన్నపము,
మో[4]డ్పఁడు సేతులు, మ్రొక్కఁడుసాఁ[5]చి,
కీ[4]డ్వడి గద్దియక్రింద నుండండు,
శివభక్తిపరునయ్య జియ్య యన్నాడ్కి
నవనీశునంకింపఁ డట్లునుఁగాక
కదిసిన మిండజంగమమున కధిపు
నెదురను బండరు నిటుసూఱఁ విడుచు
జంగమంబునకు బిజ్జలు[2]సతి నిచ్చె
వంగక యతఁడెక్కు వాహనం బిచ్చె
ధర నిట్టిసేవకధర్మము గలవె
యరుదరుదని నను లద్భుతం బంద

* ఇక్కడ మాద్రితప్రతిలో "వ్యసనాదితనుసఃవర్జితుం డగుచు" అని ఒక్కపాదమే ఉన్నది.

౧. జే, ౨. షు, ౩. డ, ౪. ప్ప, ౫. ఁగి, ౬. విచ్చి; యిచ్చి (చ్చె), ౭. స్థి.

నప్పటికప్పటి కాబిజ్జలుండు
దప్పులు పట్టుచు దండింపఁ [1]బనుప
నప్పటికప్పటి కాబసవయ్య
దప్పక శివుమహత్త్వముఁ బ్రతిష్ఠింప
నల్లయ్య [2]మధువయ్య యను భక్తవరులఁ
బ్రల్లదుఁడై రాజు వఱపుడు, నతని
యాయతైశ్వర్యంబు నతులప్రతాప
మాయుష్యమును భవి[3]ష్యము రాజ్యరమయు
నవనిలోఁ జాళుక్యు లనుపేరు వాఱుని
కవి[4]లియఁ దుడిపించి కల్యాణకటక
మిం[5]డిత భక్తి మహి[6]ష్ఠత పేర్మిఁ
బాడుగా శపియిం[7]చె బసవనమంత్రి
మసలక జగ[8]దేవ మొల్లె బ్రహ్మాయులు
వాసప[9]రి బిజ్జలుఁ బొరిగొని రట్ల,
యడపద రేచయ్య యన నొకభక్తుఁ
డడ[10]రువేఁగీశ్వరు నడపంబువాఁడు
నావేఁగివల్లభుం డట్లొక్కనాఁడు

---

౧. దలఁప, ౨. మధుపయ్య, ౩. వ్యభ్రరాజ్యమరయ, ౪. లెను, ౫. డేర, ౬. ష్ఠి, ౭. ంప, ౮. క, ౯. డి, ౧౦. ర.

దేవియుఁదాను నతి[౧]ప్రియగోష్ఠి
నున్నెడ నం[౨]దొక్కఁ డొక్కయాఁబోతు
జన్నియ సెడఁ[౩]గట్టి [౪]దున్నంగఁ[౫]జూచి
భక్తులు [౬]పొడిచిరా పాపాత్ము [౭]ననుచు
వ్యక్తిగా యామికుల్ వచ్చి చెప్పుడును
నదియుఁ దానెట్టిది యాఁబోతనంగ?
నదిగాక జన్ని[౮]య యదియుఁ దానెట్లు?
జన్నియఁ జెడఁజూడు చందంబ దెట్లు?
జన్నియఁ[౯]జెఱచినఁ జంపంగనేల?
యనపుడు నంతర్గృహావాసియైన
వనితఁ గటాక్షించి [౧౦]వరుఁడు నవ్వుచును
బ[౧౧]లుకపై నాఁబోతు భావంబువ్రాసి
తొలఁగక యాఁబోతు తొడలింగముద్రఁ
బటు[౧౨]తరంబుగ వ్రాసి బ[౧౩]లుపంబు[౧౪]నంద
యటుసూ[౧౫]డె నిటుసూ[౧౬]డె [౧౭]ననుచునమ్ముద్ర
సెడ[౧౮]వ్రేయఁగని తనచేనున్న సురియ

---

౧. ప్రీతి, ౨. దొక్కదొక్క, ౩. చూడు; చూచి; నటు
౪. డెన్నంగ; దున్నెడ, ౫. నెరంగి; నెఱిఁగ; యొఱిఁగి, ౬. దొ,
౭. ఁడ, ౮. ద, ౯. చెడజూడ, ౧౦. వచ్చి, ౧౧. ల, ౧౨. రయం,
౧౩. ల, ౧౪. చేన, ౧౫ ర, ౧౬. డు, ౧౭. మ, ౧౮. వ్రా.

పడఁ[1]బూన్చి యారాజు వనిత భి[2]ట్టులుక
నటువొడ్చె నిటువొడ్చె[3]ననుచు రేచయ్య
గుటిలాత్ము వేఁగిశుఁగూలంగఁ బొడిచెఁ
గాన భక్తులు సేవకస్థితిఁగొల్చి
రేనిఁ గొల్చిరిగాక యిల సత్పథంబు
విడుతు[4]రే సద్భక్తి విధిఁ బ్రాణమైన
విడుతురు గావున వేయును నేల
భక్తులు గొలువరే భవిఁ దొల్లి యనుచు
భక్త[5]లనడవళ్లు ప్రతివొల్పఁదగునె?
భవిఁగొల్వఁడే తొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువా[6]రు బసవయ్యయట్ల
బంధురలీలఁ దత్ప్రాణపదంబు
సంధింపవలవదే జంగమం బంద ?
భవిఁగొల్వఁడే తొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
చేయంగవలవదే, చెచ్చెర వంగ-
కాయలు ప్రాణలింగంబులుగాఁగ ?
భవిఁ గొల్వఁడే తొల్లి బసవరా జనుచు

---

౧. జాచి; జాది, ౨. ట్టి, ౩. ల్చె, ౪. రె, ౫. లా, ౬. ఁడు.

భవిఁ [1]గొలిచెడువారు బసవయ్యయట్ల
యసమాక్షుఁ డొకరూపమై వచ్చి వేఁడ
నొసలికన్ను శునకొసగంగవలదె?
భవిఁ గొల్వఁడే తొల్లి బసవరా జనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
మిండయ్య వేఁడుడు మొలుత వస్త్రంబు
లొండొండ మొలవంగ నొలిచియీవలదె ?
భవిఁ గొల్వఁడే తొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
[3]పడఁబోయి దవ్వుల బసవ[4]రో యనినఁ
బడకుండఁ గాళవ్వఁ బట్టంగవలదె ?
భవిఁ గొల్వఁడే తొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
[5]తఱలి దివ్యామృతధారలు వెల్లి
వఱుపంగవలవదే భక్తుని[6]మేన ?
భవిఁ గొల్వఁడేతొల్లి బసవరాజనుచు
భవిఁ గొలిచెడువారు బసవయ్యయట్ల
మిండ[7]జంగము[8]లకు మేదినీశ్వరుని

---

౧. నిగొల్చి, ౨. ల, ౩. పడుచుండి, ౪. రాజ, ౫. తఱఁగి; తలరి, ౬. వలన, ౭. య్యాలకునిచ్చి, ౮. నకు(కి).

బండరు[1]వాసగి తాఁ బడయంగవలదె ?
భవిఁగొల్వఁ జేతొల్లి బసవరాజనుచు
భవిఁగొలిచెడువారు బసవయ్యయట్ల
భావజారికి సమర్పణ సేసి[2]విషము
ద్రావంగవలవదే ధర?—నట్లుఁగాక
చూడఁజూడఁ దెనుఁగు జొమ్మయ్య వేఁట
లాడఁడేయని వేఁటలాడెడువారు
దనచేతఁజచ్చిన దండిమృగములఁ
దనువులతోన యుద్యద్విమానము[3]ల
నిచ్చలు[4]జొమ్మయ్య నిటలాక్షుపురికిఁ
[5]బుచ్చినభావనఁ బుచ్చంగవలదె ?
కావింపఁడే హింసఁ గన్నప్పఁ డనుచుఁ
గావలు [6]లై హింసఁ గావించువారు
గన్నప్ప గన్నుఁ దక్కఁగ నిచ్చినట్లు
గన్నిశ్వరునకు[7]ఁ దక్కంగ నీవలదె?
వారలచరితలు వారి[8]క చెల్లు
వారలమహిమలు వారికె చెల్లుఁ
గాక వారలప్రతిగట్టి వర్తింప

---

౧. వీషచే, ౨. లు, ౩. లు, ౪. బొమ్మన్న, ౫. జొ, ౬. రై, ౭. నక్కుడినీయ, ౮. కె.

మాఁకొలఁదియె యింక మాటలేమిటికి
నొప్పింతు నీకు నీ యొడలు భూనాథ
యొప్పఁగొమ్మనుచు నయ్యుదయావనీశు
చేనున్న సురియఁ జెచ్చెరఁ బుచ్చుకొనుచుఁ
దానెక్కి గోపురద్వారహర్మ్యమున
ప్రమథపురాతన [1]ప్రత్యగ్రభక్త-
సముదయ(శ్రీ)పాద జలజాతిత్తుఁ డగుచు
మును మునీంద్రునిశాప మునలావశేష-
మున [3]న యాదవులు నిర్మూలమైనట్లు
దడయ కీ సురియచేతన వీనివంశ
మడరంగ నిర్మూల మయ్యెడమనుచు
నలుగు[4]పై మంత్రోక్తమగు భూతిఁ జల్లి
తలఁకక లింగార్పితము సేసియంత
నలుగుమోహాణమున హస్తంబు దొడిగి
[2]ఝుళిపించి నివిడి [6]పార్శ్వంబుల నివిడి
క్రుమ్మిడి వామహస్తమ్మున నిడి ర-
యమ్మున యామ్యహస్తమ్మున నలుగు
గళమున సంధిం[10]పఁ గరతలంబంద

1. ప్రాక్తన, 2. ష్ట, 3. ను, 4. దున, 5. న, 6. న, 7. జలి, 8. హస్త, 9. మ్మి, 10. ంచికర.

తలప్రేలుచుండె నెంతయు నద్భుతమ్ము
దళుకొత్త ధవళేశ! ధవళేశ! యనుచు
నలి రజతాద్రికి నామయ్య యరిగె
ఘణఘణ యని చేతి ఘంట[1] మ్రోయఁ
బ్రణుతింప నోహిళప్రభుఁ డేఁ[3]గినట్ల
యింతవృత్తాంతంబు నెఱిఁగి దూషకజ-
నాంతకమతి మల్లికార్జునారాధ్య-
సత్తమోత్తముఁ డంత శాపోదకంబు
లెత్తి యశేష మాహేశ్వరకోప-
వహ్ని నామనగణ వ్రాతైక[4]కోప-
వహ్నిప్రపూరి తావారి తోన్నతశి-
ఖావలిచే "నుదయాభిధానావ-
నీవల్లభశ్చ" నా నెఱి నుదయావ-
నీవల్లభుని సమన్వితమహాపాప-
ద[5]వమునను "సపుత్రకళత్రమిత్ర-
బాంధవో" యన సుతాప్తకళత్రమిత్ర-
బంధుప్ర[6]ధానా[7]గ్రభట కరితురగ-
బలచమూనాయక ప్రభృతులుఁ దాను

౧. త, ౨. యుమ్రోయ, ౩. గు, ౪. పోధను, ౫. దావ, ౬. తా, ౭. ష్ట.

జెలులు "వినశ్యన్తి క్షిప్రం పరం వి-
దూషకో" యన నిష్ఠురంగాఁడ"మనుచు
రోషించి మల్లికార్జున పండితయ్య
శాపోదకము లెత్తిచల్లె నక్షణమ
చూప[2]ఱకును భీతి సోద్యంబుఁ [3]బొందఁ
గాదింక నీ పానుగంటనుండఁగ మ-
హాదేవ భక్తులకనుచుఁ గట్టలుక
మసలక పండిత మల్లికార్జునుఁడు
వెసఁదలిర్పఁగఁ బురి వెడలంగ వె[4]నుక
నక్కజంబుగఁ [5]బూచె [6]నంతఁ గల్పొన్న,
[7]గుక్కరోకుఱ్ఱని కూసెఁ [8]గల్పొక్కడి,
పురి మహోత్పాతముల్ [9]పుట్టె వెండియును
బురము వాడగునని బుధులు గలంగ
విదితశాపోద్ధ[10]ంత విలయోగ్రవహ్ని
కుదయావనీశుఁ డాహుతియయ్యెఁ బుత్ర-
పౌత్రు లన్యోన్యకళత్రాభి[11]గతిని

౧. దున, ౨. ఱులకుభీతి; రుల్ భీతియు, 3. నం, ౪. వ, ౫. జూచె; బూచె, ౬. నక్కలుపొన్న; నంతకల్పొన్న, ౭. కొక్క, ౮. తొల్లొక్కడు, ౯. పుట్టంగఁదొడఁగె, ౧౦. త, ౧౧. రతిని; నిర(యు)తి.

శత్రులై చీకటిచప్పరంబులను
దడయ కా సురియచే తనపురిజనము
నరయంగ నిర్మూలమై రట్లుగూడ,
సంతానమెల్ల నిస్సంతానమయ్యె,

### బసవేశ్వరునిగూర్చి పండితారాధ్యుని ప్రలాపకథనము

నంతనిక్కడఁ బండితారాధ్యవిభుఁ డ-
వారితపరవాది వనిపురంబునకు
భో[1]రన నేఁగంగఁ బురహారమూర్తి
బుధపుంగవుఁడు వనిపురశంకరయ్య
యధిగత భక్తిమహత్త్వంబు దనరఁ
జయ్యన సద్భ[2]క్తి సహితుఁడై గణమ-
హియ్యత దోలుఁకాడ నెదురేఁగుదెంచి
కడు[3]నర్థిఁ బౌరు లక్కజమంది పొగడఁ
దోడుకొనిపో[4]యి భక్తులుఁ దాను[5] హరుని
మంగళశివకథా [6]మహితసంగప్ర-
సంగతిఁ గొన్నివాసరములు [7]నలిపి
కల్యాణమున కభిగమనంబు సేయఁ
గల్యాణమునభక్తి [8]గజిబిజి వుట్టె

౧. ఱ, ౨. క్తి, 3. భక్తిపో, ౪. వ, ౫. వారు, ౬. మహితప్రసంగ (షడ్గోష్ఠి), ౭. మసలి, ౮. గజబిజ.

## మహిమ ప్రకరణము

బల్లహు బిజ్జలు భంజించి రంత
బల్లిదుల్ జగదేవ మొల్లె బొమ్మయలు
నేఁగి కప్పడి సంగమేశ్వరంబునకుఁ
దాఁగోరి బసవనదండనాయకుఁడు
నిచ్చమై నాసంగమేశు గర్భంబుఁ
జొచ్చె దేహముతో[1]న చోద్య మొప్పార,
నిదియుఁ దా నేఁటికి నెనిమిది దినము
లది నిక్క మనుచు నొక్కయ్య సెప్పుడును
బండిశేంద్రుం డుల్కిపడి శోకవహ్ని
నిండా[2]రి మనమున నెక్కొని పర్వ,
“బసవయ్య బసవేశ బసవకుమార
బసవలింగంబ నా [3]బండారి బసవ
సంగన బసవయ్య సంవిత్ప్రదీప
సంగన బసవన్న చరలింగరూప
సంగన బసవన్న సత్యప్రలాప
సంగన బసవన్న శమితేక్షుచాప
సంగన బసవన్న సన్నుతభూప
సంగన బసవన్న సంహృత[4]పాప
సంగన బసవన్న [5]శత్రుప్రతాప

---

౧. డఁజో, ౨. రు, ౩. వాలిదైవంబ, ౪. భూప, ౫. సత్య.

సంగన బసవన్న సరసకలాప
సంగన బసవన్న [౧]జగదగ్రగణ్య
సంగన బసవన్న సకల[౨]శరణ్య
సంగన బసవన్న శాశ్వతపుణ్య
సంగన బసవన్న సద్గుణ[3]పణ్య
సంగన బసవన్న సద్భక్తగణ్య
సంగన బసవన్న శరణావరేణ్య
సంగన బసవన్న సారనైపుణ్య
సంగన బసవన్న సహజకారుణ్య
సంగన బసవన్న సాంద్రప్రమోద
సంగన బసవన్న సంస్పృహానాద
సంగన బసవన్న శైవవినోద
సంగన బసవన్న సత్యప్రసాద
సంగన బసవన్న సంచితవేద
సంగన బసవన్న జంగమాహ్లాద
సంగన బసవన్న [౪]శర్వావిభేద
సంగన బసవన్న శమితవిషాద
సంగన బసవన్న సంసారదూర
సంగన బసవన్న జగదేక[౫]వీర

౧. సకల్పా, ౨. వరే, ౩. పు, ౪. పర్వాది, ౫. శూ.

సంగన బసవన్న సంయమాధార
సంగన బసవన్న సౌమ్యశరీర
సంగన బసవన్న సముచితాచార
సంగన బసవన్న సద[1]యాప్రచార
సంగన బసవన్న సద్భక్తిసార
సంగన బసవన్న శంభుకుమార
సంగన బసవన్న సత్కృపావరణ
సంగన బసవన్న సద్భ[2]క్తశరణ
సంగన బసవన్న శమద[3]మాభరణ
సంగన బసవన్న జలజాతచరణ
సంగన బసవన్న జనన ప్రహరణ
సంగన బసవన్న శాంతివిహారణ
సంగన బసవన్న స్వసమయోద్ధరణ
సంగన బసవన్న శైవవిస్ఫురణ
సంగన బసవన్న సత్ప[4]థాచార్య
సంగన బసవన్న సంస్థితశౌర్య
సంగన బసవన్న సాత్త్వికస్థైర్య
సంగన బసవన్న సంగీతధుర్య
సంగన బసవన్న సముచితధైర్య

---

౧. య, ౨. క్తికి, 3. యా, ౪. దా.

సంగన బసవన్న సహజగాంభీర్య
సంగన బసవన్న చరితార్థచర్య
సంగన బసవన్న శాంభవచర్య
సంగన బసవన్న సమ్యక్చరిత్ర
సంగన బసవన్న సద్ధర్మగాత్ర
సంగన బసవన్న షడ్వర్గజైత్ర
సంగన బసవన్న సత్కృపాపాత్ర
సంగన బసవన్న సాధితామిత్ర
సంగన బసవన్న జనిలతాధాత్ర
సంగన బసవన్న శశ్వత్పవిత్ర
సంగన బసవన్న జంగమక్షేత్ర
సంగన బసవన్న సద్వ్రతోత్తుంగ
సంగన బసవన్న సంతతాభంగ
సంగన బసవన్న శ్రౌతప్రసంగ
సంగన బసవన్న సంహృతానంగ
సంగన బసవన్న సాంబాంతరంగ
సంగన బసవన్న సాక్షాచ్ఛివాంగ
సంగన బసవన్న సద్గురులింగ

---

౧. దిత; ధిపా, ౨. జనిలతాదాద్ర; సంస్తుతిపాత్ర; సంహృతానంగ.

సంగన బసవన్న షట్స్థలానంగ
బసవన్న బసవయ్య బసవకుమార
బసవ బసవరాజ బసవలింగంబ
నాయన్న నాతండ్రి నామనోహరుండ[1]
నాయయ్య నాజియ్య నాప్రాణనాథ
నామోహవారాశి నాయశోరాశి
నామాత నాభ్రాత నను బెట్టి నీవు
గాయజసంహారు గర్భంబుఁ జొచ్చి-
తా"యంచు 'హా'యంచు "హాసంగమేశ
హరివిరించి సురాసురాద్య ప్రమాణ
చిరభక్తి[4] రత్న ఘర్షిత మహాశాణ
వ్యాపితోదాత్త సర్వకళా ప్రవీణ
ఖ్యాపితాంబుజభవ కంకాళవీణ
నిజభక్తి విరచిత నిఖిల ప్రమాణ
సుజనైకసన్నుత సురగిరిద్రోణ
వృషభాధిపవిషాణ వీక్షణప్రీణ
విషగళోద్యత్కాంతి విలసనాక్షీణ
యురుతరాజాండ సంయుత గర్భకోణ

౧. మనో, ౨. స్రా, ౩. త, ౪. క్త, ౫. మా, ౬. పురా.

నరనుత[౧]భోగగణ సహప్ర[౨]యాణ
దత్తకరాంబుజద్వయ[౩]భట్టబాణ
వృత్త[౪]దయారసాన్వితని[౫]ర్వాణ
కృ[౬]త్త [౭]వాణీఘో[౮]ణ గేయ[౯]విశ్రాణ
[౧౦]దత్తచోడక్షితి ధవ[౧౧]సతీ[౧౨]ఘోణ
నిహత మరుజ్జననీ లసద్ఘ్రాణ
సహజకల్యాణ కృశానుకృపాణ
శర[౧౩]ణాగత త్రాణ సాన్నిధ్యబాణ
పరి[౧౪]హృతాసమబాణ బద్ధాక్షబాణ
కృతపూర్వగీర్వాణ గీర్వాణమకుట-
ధృత[౧౫]శోణపాషాణ తేజోధురీణ
చరణాంకనిర్వాణ సౌఖ్యపారీణ
పరమమాహేశ్వర [౧౬]ప్రాణమత్ప్రాణ
రాజితలింగతనూజు, [౧౭]నూర్జితమ -
నోజు, [౧౮]సుగుణకల్పభూజును, దత్తవ-
బీజును, భక్తసమాజును, సుగుణ

---

౧. భాగ; భోజ, ౨. వీ, ౩. ప, ౪. ద్ధయాన, ౫. ర్యా, ౬. ంత; త్తి; ద్ధి, ౭. మణీ, ౮. ణి, ౯. నిర్వా; నిర్మా, ౧౦. దంత, ౧౧. ర, ౧౨. పాణ; శోణ, ౧౩. ణగణ, ౧౪. హ, ౧౫. శోణ; శోధి, ౧౬. స్త్రాల, ౧౭. మా, ౧౮. గుణాకల్ప; సుకణకల్ప.

నైజును, గతభవవ్యాజును, బుణ్య-
భాజును, నుత కే[1]శి రాజును, సుకృత-
భోజు, [2]దయాక్షి సరోజును, దివ్య-
తేజును, నిత్యవందిత చెన్నబసవ-
రాజు, మహితమాదిరాజు [3]ధర్మాధి-
రాజును, బూర్వగోరాజును, భక్తి-
రాజును, [4]నతసురరాజు[5]ను, బసవ-
రాజు, నారాజు, నిరస్తచాళుక్య
రాజును, రాజాధిరాజు, రాజా[6]ంక!
నీదుగర్భాంతర్వినిహితుఁ గావించి-
తే, దేవ! సంగయదేవ! దేవేశ!
[7]బాడునఁబాడని ప్రమథావతారుఁ
గూడుకొంటి[8]వె లింగ! కూడలిసంగ!
* ప్రోడిసాక్షాన్మహోరుద్రావతారుఁ
గూడుకొంటివె లింగ! కూడలిసంగ!
వేడుక[10]నీయాది వృష[11]భాధినాథుఁ

---

౧. శి, ౨. గ, 3. సుధర్మ, ౪. ను, ౫. శ్రీ, ౬. ంకి, ౭. పాదాన; బాడాన, ౮. డి, ౯. వి, ౧౦. నయ్యాది, ౧౧. భావతారు; శేంద్రమూర్తి.

* ఇక్కడ వ్రాతప్రతులలో పాదాలక్రమము అనేకరీతులుగా ఉన్నది. అది అంతా ఇచ్చట చూపలేదు.

గూడుకొంటివె లింగ ! కూడలిసంగ !
పాడిదప్పని వీరభద్రావతారుఁ
గూడుకొంటివె లింగ ! కూడలిసంగ !
జాడదప్పని మీ ప్రసాదావతారుఁ
గూడుకొంటివె లింగ ! కూడలిసంగ !
యీడితభక్తిమహిమావతారుఁ
గూడుకొంటివె లింగ ! కూడలిసంగ !
తప్పని నిజశివధర్మావతారు
నొప్పుగొంటివె లింగ ! కప్పడిసంగ !
త్రిప్పని వీరభక్తిస్థలాచారు
నొప్పుగొంటివె లింగ ! కప్పడిసంగ !
చొప్పారు [1]జంగము సుపదప్రకారు
నొప్పుగొంటివె లింగ ! కప్పడిసంగ !
యొప్పగు సంతతాభ్యుదయప్రచారు
నొప్పుగొంటివె లింగ ! కప్పడిసంగ !
చెప్పఁ జిత్రంబగు శివప[2]థాచా[3]రు
నొప్పుగొంటివె లింగ ! కప్పడిసంగ !
వరలింగ సామ్రాజ్య పట్టబద్ధుండు
వరభక్తిపట్ట మె[4]వ్వారికిఁ గట్టితివి ?

౧. స, ౨. ఢా, ౩. ర్య, ౪. వ్వారిఁగట్టితీవు.

యఖిలసద్భక్తి రాజ్యాన్విత మహి[1]తుఁ
డఖిలసద్భక్తిరాజాంకుఁ డెవ్వఁడు?
నసమసద్భక్తదేహైకదేహుండు
నెస[2]గ[3]భక్తప్రా[4]ణి యింక నెవ్వఁడు?
పురహర! మిముఁబూన్చు పూజాఫలములు
వారిఁబోరి నొప్పించు పురుషుఁ డెవ్వఁడు?
శంకర! నీగణాస్థానంబుజ్యోతి
యింక నెవ్వఁడు దా నీ జగత్త్రయిని?
సర్వాంక! మీకూర్చు శరణులచేతి
దర్పణం బెవ్వఁ డీ త్రైలోక్యమున[5]ను?
ప్రాణేశ! [6]మీమహా[7]భక్తవర్గంబుఁ
బ్రాణమెవ్వఁడు జగద్భవనాంతరము[8]న?
నింక నీ వీరమాహేశ్వరాచార-
సంకులంబునకు దెసయు దిక్కు[9]నేది?
యెవ్వఁడు వీరమాహేశ్వరసమయ
మివ్వసుంధర వెలయింపంగనోపు?
నెవ్వండు వీరమాహేశ్వర[10]శ్రేణి
ద్రెవ్వకుండంగఁ బ్రతిష్ఠింపనోపు?

---

౧. త; మ, ౨. గు, ౩. చర, ౪. ణ, ౫. కు, ౬. నీ, ౭. ల, ౮. ర్య, ౯. నెద్ది, ౧౦. సర.

నెవ్వాండు వీరమాహేశ్వరమహిమ
నివ్వటిల్లఁగ భువి నిష్ఠింపనోపు?
నెవ్వాండు వీరమాహేశ్వ[౧]రాహితుల
క్రొవ్వడంగఁగఁ [౨]గుంటఁగూ[౩]ల్పంగనోపు?
నెవ్వాండు వీరమాహేశ్వరకోట్ల
మవ్వంబు దళుకొత్త మన్నింపనోపు?
నెవ్వాం డఖిలజంగమేచ్ఛానువర్తి?
యెవ్వాండు జంగమాభీష్టప్రదాత?
సాక్షాచ్ఛివుం డని జంగ[౪]మప్రవరు
లీక్షి[౫]ంచు సద్భక్తివేత్త యెవ్వాండు?
జంగమంబును బ్రాణలింగ మన్ బాస
భంగిగా వర్తించుభక్తుఁ డెవ్వాండు?
నడుగకమును జంగమాభీష్టవితతిఁ
దడయకొసగు మహాదా[౬]ని యెవ్వాండు?
నిర్వంచకస్థితి నిఖిలభక్తుల[౭]ను
సర్వార్థము[౮]లఁ దన్పు స్వామి యెవ్వాండు?
నెగడ నెల్లింటికి నేఁటి కెట్లనిన
వగ యెఱుంగని లింగవంతుఁ డెవ్వాండు?

---

౧. ర, ౨. మది, ౩. ర్పు, ౪. మావళిని, ౫. ంపు, ౬. త, ౭. ను, ౮. లు.

ముట్టిన బయలైన మూర్తిఁ గావింప
నెట్టన చాలెడు నిపుణుఁ డెవ్వాఁడు?
పట్టిన పదడైనఁ బసిఁడిఁగావింప
నెట్టనఁ జాలెడు నిత్యుఁ డెవ్వాఁడు?
తలఁచినభక్తహితానంబు దలఁచు
తలఁపులఁ దలకూర్చు దాత యెవ్వాఁడు?
వంగకాయలు ప్రాణలింగముల్ గాఁగ
సంగతి దయఁజూచు శరణుఁ డెవ్వాఁడు?
సజ్జనులకు లింగ జంగమభక్తి
నొజ్జ యై కఱపెడు నొడయఁ డెవ్వాఁడు?
హరుప్రసాదంబుగా నత్యుగ్రవిషము
ధరియించి పడసిన ధన్యుఁ డెవ్వాఁడు?
పేర్కొన్న సద్భక్తబృందంబు మతుల
కోర్కులు సెల్లించుఁ గుశలుఁ డెవ్వాఁడు?
సత్యసద్భక్తి నిష్ఠను శివరాత్రి
నిత్యంబుఁ జెల్లించు నియతుఁ డెవ్వాఁడు?
వెలుచ [3]జంగమజాతి భేదభావంబుఁ

౧. నఁజా; ణజేసెడు, ౨. క్తి, ౩. భక్తుల,

గలనైన నెఱుఁగని [1]గరువ మెవ్వాఁడు ?
శిరమటఁ బాసిన శివభక్తతతికి
శర [2]ణన్న మఱవని శరణుఁ డెవ్వాఁడు ?
పట్టినవ్రతములు ప్రాణంబుఁ బోవఁ
దట్టిన విడువని [3]దక్షుఁ డెవ్వాఁడు ?
నతనిసామర్థ్యంబు నతనిమహాత్త్వ
మతనిచరిత్రంబు లల్పుల కగునె ?
ప్రమథాధిపుల కెల్లఁ బ్రాణంబు [4]నీవు,
ప్రమథులప్రాణ[5]ంబు బసవలింగంబు,
సర్వేంద్రియములుఁ బ్రసాదేంద్రియములు,
సర్వాంగకళలుఁ బ్రసాదాంగకళలు,
గరణంబు లిష్టలింగము కరణములు,
సరణాబ్జములు ముక్తిసతి పుట్టినిండ్లు,
భరిత[6]సద్గుణములు భక్తిబీజములు,
సరిత[7]లు దేశికేశ్వరులకు గురులు,
వరుసవేదులు గరపల్లవాంగుళము,
లరయ నపాంగాంశు లమరధేనువులు,

౧. ఘనుఁడు నె. ౨. ణులు; ణని, 3. ధన్యు, ౪. మీరు, ౫. మా, ౬. గుణావళుల్, ౭. ముల్ గురుచరే,

దలఁపుల[౧]కొనలు సింతామణిగనులు,
వలుకులతీ[౨]పులు వరతత్త్వ[౩]లతిక,
ల[౪]తనిలింగపసా[౫]యి తాఖ్యశస్త్రంబు
క్షితి ముత్తెములుగురిసిన దివ్యశుక్తి,
యతని లింగపసా[౫]యితాఖ్యశస్త్రంబు
క్షితిపతి యర్థ మిచ్చిన శైవలక్ష్మి,
యస[౬]మ లింగపసా[౫]యి తాఖ్యశస్త్రంబు
విన మమృతంబు గావించిన మందు,
ననమలింగపసా[౭]యి [౫]తాఖ్యశస్త్రంబు
నొసలిక స్నిశున కొసగినవేల్పు,
నలరు లింగపసాయితాఖ్యశస్త్రంబు
సెలువ కంబరము లిచ్చినపేటికంబు,
ధరణి లింగపసాయితంబను వాలు
హిరియనాగయకుఁ బా లిచ్చినసురభి,
సారంబు లింగపసాయితాయుధము
సోదులకును భక్తి సూపిన గురువు,
నడరు లింగపసాయితాహ్వయాయుధము
నడకుండఁ గాళవ్వఁ బట్టిన కరము,

---

౧. దో, ౨. వు, ౩. లతలు, ౪... ౫. తుల, ౬. య, ౭. దు, ౮. తాహ్వయాయుధము,

సంగీతి లింగపసాయితాయుధము
జంగమప్రాణాభిసంగతికీలు,
నలరు లింగపసాయితాహ్వాయాయుధము
నెలమి బిజ్జలు శపియించిన జిహ్వా,
జననుత లింగపసాయితాయుధము
ఘనమగు తలఁపుల కల్పభూరుహము,
బసవనిమూర్తి నెబ్భంగిఁ గీర్తింప ?
బసవని మహిమ నెబ్భంగి నుతింప?
బసవఁడ యెఱుఁగు నా బసవన్న చరిత;
వసమె యెవ్వరికైన వర్ణింనల్ సేయ ?
బసవాక్షరపఠన ³ఫలము మాహాత్మ్య
మసమాన, మెట్లన్న నట్లొక్క మాఱు
'బా' యన్న లింగసంబంధసౌఖ్యంబు,
'సా' యన్న సద్గురు సత్కృపోన్నతియు
'వా' యనినఁ బ్రసాదవహనంబుఁ బొందు,
వాయార నటు 'బసవా!' యనిరేని ;
నసలారఁ ద్రిస్థలోద్యద్భక్తియుక్తి
బసవన్న సేవలభక్తుఁడే దేవ!

౧. త. ౨. న సేయ, ౩. ఫలమహత్త్వంబె (బ), ౪. క్తి.

విను "తవ పుత్త్రో భవిష్యామి" యనుచు
ము[1]ను శిలాదుం డను మునివల్లభునకు
శుంభదుదాత్తవిస్ఫూర్తి ద్వితీయ
శంభుఁడనఁగఁగాదె జనియించి తీవు?
ననమాతృభక్తిహితార్థమై నీవ
బసవఁ డన్ పేర సంభవమైతి కాదె ?
యసమాన ! యటుగాన హరుఁడన్న నీవ
బసవండనఁగనీవ పానలోఁండేల ?
విశ్వేశ ! యయ్యాదివృషభేంద్ర[2]మూర్తి
విశ్వవందితకీర్తివిస్ఫూర్తి బసవ-
లింగంబు నీదివ్య లింగగర్భాబ్ధి-
సంగతాభంగురోత్తుంగతరంగ-
రంగసంగతమూర్తి యంగీకరించి
భంగిగా నం[3]ద వెలుంగె, ముల్లోక-
గురుఁడ ! యెట్టులు గూడుకొంటి సద్భ[4]క్త-
వరగణాధీశు [5]లెవ్వరుఁ గానరుండ ?
మడివాలు మాచయ్య మా[6]ఱుగు వర్చితివొ
బడ[7]గర బ్రహ్మయ్యఁ బని[8]కిఁ బంచితివొ

౧. ని. ౨. రూప, ౩. ద్వి, ౪. క్తి, ౫. నె, ౬. డు, ౭. వ, ౮. యు,

మాదిరాజయగారి మరులు గొల్పితివో
యా[1]దయ్య [2]మల్లయ్య [3]నవులఁబుచ్చితివో
కిన్నరబ్రహ్మయ్యఁ [4]గ్రిక్కరించితివో
కన్న[5]ద బ్రహ్మయ్యఁ గనుమొ[6]ఱంగితివో
శూలదబ్రహ్మయ్యఁ జూపు దప్పితివో
మోళిగ మారయ్య మోసపుచ్చితివో
తెలుఁగు జొమ్మయగారిఁ [7]దీలు పర్చితివో
కలకేత బ్రహ్మయ్యఁ [8]గడవఁబుచ్చితివో
కక్కయ్యఁ గల్లయ్యఁ [9]దక్కు వెట్టితివో
చిక్కయ్య లింగయ్యఁ జిక్కువర్చితివో
గజ్జేశు మసనయ్య బుజ్జగించితివో
యజ్జదాసయగారి నాగడించితివో
షొడ్డల బాచయ్య వెడ్డువెట్టితివో
వెడ్డునాగయగారి వెడఁగు వర్చితివో
దసగణ సింగయ్య [10]దండు వెట్టితివో
ము[11]సుఁడి చౌఁడయగారి [12]మిము న్నమార్చితివో

---

౧. దె, ౨ నల్ల, సకల, ౩. నలఁత, ౪. గేక, ౫. డ, ౬. ఱి. ౭. దిక్కుమఱచితివో; దిక్కువచ్చితివో, ౮. గలఁత, ౯. ది, ౧౦. దక్కు, ౧౧. సిడి (డి), ౧౨. ముందువెట్టితివో; మోసపరచి.

# మ హి మ ప్ర క ర ణ ము

గురుభక్తదేవని గ్రుమ్మఱించితివో
సురగి చౌఁడయగారిఁ జొక్కువెట్టితివో
నాచిదేవయగారి నవ్వు సేసితివో
యేచెన్నబసవన్న నవులఁబుచ్చితివో
యేకాంతరామయ్య నేమఱించితివో
కాక వారున్నను గన్నను విన్న
సంగడబసవన్న సద్భ[1]క్తతిలకు
మ్రింగనిత్తురె నిన్ను సంగమేశ్వరుఁడ!
నిచ్చ గుంచెఁడుపాలు నిన్నుఁ ద్రావింప
మెచ్చి యాగొడగూచి మ్రింగినయట్లు,
మ్రుచ్చిలి ఘటమధ్యమున నిన్నుఁ గొలువ
మెచ్చి బొల్లవ్వను మ్రింగినయట్లు,
లిచ్చ శివాధిక్యమిలఁ బ్రతిష్ఠింప
మెచ్చి బాచరసును మ్రింగినయట్లు,
లచ్చుగా జైనబౌద్ధాదులఁ ద్రుంప
మెచ్చి యొడయపిళ్ల మ్రింగినయట్లు
మెచ్చక యితరనామోచ్చారుఁ ద్రుంప
మెచ్చి యుర్యమరాజు మ్రింగినయట్లు,

---

౧. క్త్రి, ౨. క.

నచ్చి నీ సందర్శనము సేయురతికి
మెచ్చి తిర్నా[౧]ళ్ళోవ మ్రింగినయట్లు,
మచ్చిక దృఢభక్తి మానసంబునకు
మెచ్చి వాగీశ్వరు మ్రింగినయట్లు
సెచ్చెరఁ బాడంగ సిద్ధబుద్ధయల
మెచ్చి యందఱుఁ జూడ మ్రింగినయట్లు,
గ్రచ్చుఱ నిర్వంచకత్వంబునకును
మెచ్చి యాబసవన్న మ్రింగితే నేఁడు?
దాసయ్య, శంకర [౨]దాసయ్య, దాస-
కేసయ్య, ధూర్జటి కేశిరాజయ్య,
దారయ్య, భోగయ్య, దసరయ్య, శివకు-
మారయ్య, దోరయ్య, మలయరాజయ్య,
మోహిళ్ళుఁ, దుద్భటుఁ, దుత్తుంగచోడఁ,
డాహుతి [౩]మల్లి దేవయ్య, [౪]మొల్లయ్య,
మధుపయ్య, జగదేవ మల్లబ్రహ్మయలు,
నిధనయ్య, ధవళయ్య, నేమద మైలి,
వీరశంకరుఁడు, నిర్విషదమల్లయ్య,

---

౧. ళ్లువో; ళ్ళోవ; ళ్రోవ; ళ్ళావ. ౨. దాసదాసయ్య; దాసయ్యదాస, ౩. దేవమల్లయ్య, ౪. యు.

వీరభద్రయ్య, గోవింధభట్టార-
కుండు, భల్లాణదే[1]వంచుఁ, గుమార-
[2]పాలఘూర్జరుఁడు, [3]బొప్పహావామనయ్య,
గాలకంధరుఁడుఁ, జిక్కయదేవఁ డాది
ప్రచురపురాతన ప్రఖ్యాతభక్త-
నిచయంబు నీకుక్షి నిండియున్నాఁడు,
సాలదే బసవన్న శరణాగ్రగణ్యు
నేల మ్రింగితి చెప్పవే బసవేశు?
సిసువుఁ దినంగ నాసించినజిహ్వ
కసివోవకున్న[5]దే కంకాళమూర్తి ?
నాఁటిమృగావళి నమలిననోఁరి
తీఁటవోకున్న[7]దే దివ్యలింగాంగ ?
గోవత్సభక్షణ! కుత్తుకఁక్రుళ్లు
వోవకయున్న[7]దే భోగవత్సలుఁడ ?
వీక లోకములు సేవించినపండ్లు
ప్రాకు వోకున్న[7]దే ప్రళయాగ్నిరుద్ర !
మ్రింగఁ[9]గొండివై మ్రింగితి బసవ-

---

౧. వు, ౨. ఫా, ౩. బొ (చొ)ప్పయ్య, ౪. న్యా. ౫. దా; నా, ౬. టి, ౭. నా, ౮. కుట్లు; కపటు, ౯. గొండవై; గొండిమై,

లింగకుమారుఁ బాలితశివాచారుఁ
గరుణాత్మలింగ జంగమభక్తియుక్తుఁ
బారిఁగొనఁ దలఁచితే? భూస్థలినింక
దివియయు లేని మందిరము, విద్యాప్ర-
భవము లేనట్టి సభాసమూహంబు,
దానంబు లేని మాతంగంబుఁ, గంపు
లేని పుష్పంబు, సన్మానంబు లేని
దానధర్మము, లభిమానంబు లేని
మానిని, ప్రాణంబులేని దేహంబు,
శాంతి లేని యతి, భజనలేని తపముఁ,
గాంతి లేని మణి, నిక్కము లేనిపలుకు,
శశి లేని నిసి, [3]దివస్పతి లేని పగలుఁ,
*(బసులకాపరి లేని పశునివహంబు,
రసహీనమైన నిస్సారంపుఁగవిత,)
బసవన్న లేని సద్భక్తలోకంబు
చొప్పనే నీకు దివ్యోరులింగాంగ!

---

౧. వి, ౨. గ్గ. ౩. నివేశములేని యూరు; యహస్పతిలేని పగలు,

* ఈరెండు పాదములకున్ను సంస్కృత గ్రంథములో అనువాదము లేదు.

కప్పడిసంగ! సంగతదయాపాంగ!
విగతాభిషంగ! నివీతభుజంగ!
[౧]యగసుతార్ధాంగ! భక్తాత్మాబ్జ భృంగ!
పరిహృతానంగ! శుంభద్గుణోత్తుంగ!
యురుతరగంగాతరంగోత్తమాంగ!
విమలకీర్తిసురంగ! [౨]వేదాంతశ్శృంగ!
ప్రమథాంతరంగ! యభంగ! యోలింగ!
చూపవే బసవన్న సుకృతావతారుఁ
జూపవే బసవన్న సుజనమందారుఁ
జూపవే బసవన్న సు[౩]గుణ[౪]విస్తారుఁ
జూపవే బసవన్న సురుచిరాకారుఁ
జూపవే బసవయ్య శ్రుతిమతాచారుఁ
జూపవే బసవయ్య [౫]సుపథప్రచారుఁ
జూపవే బసవయ్య [౬]సూనృతాధారుఁ
జూపవే బసవయ్యఁ [౭]భాపాపహారు
ముంగల బసవన్న మూర్తిభక్తేష్ట-
లింగగర్భమున వెలుంగింపకున్న

---

౧. యగజను (సు) స్నంగ, ౨. వేదతురంగ, 3. జన, ౪. నిః
౫. శుభద, ౬. సూనృతాచారు; సుకృతావతారు, ౭. బాపసంహారు.

[1]భ్రష్టయి కనుక[2]న్నిఁ బా[3]ఱరే దేవ
[4]దృష్ట నసర్పిత స్థేయాభి[5]నిరతి ?
భక్తులజిహ్వల బసవాక్షరములు
వ్యక్తంబుగాఁగ నీ వచ్చొత్తకున్న
జిహ్వాగములచేత [6]జిరజిరగా[7]వె
జిహ్వ లనర్పిత స్థేయాభిరతిని?
భక్తులమనముల బసవాక్షరము[8]లు
వ్యక్తంబు గాఁగ నీ వచ్చొత్తకున్నఁ
[9]బనుగొన విషయవిభ్రాంతిమైఁ జెడఁ[10]రె
[11]మనసు లనర్పి[12]తో స్మత్తాభిరతిని ?
భక్తుల [13]తలఁపుల బసవాక్షరములు
వ్యక్తంబుగాఁగ నీ వచ్చొత్తకున్నఁ
బలుద్రోవలను వృథా భ్రాంతిమైఁ జెడరె
తలఁపు లనర్పిత స్థైర్యాభిరతిని ?
భక్తులపలుకు[13]ల బసవాక్షరములు
వ్యక్తంబుగాఁగ నీ వచ్చొత్తకున్న

---

౧. భ్రష్టులై, ౨. లీ, ౩. వే, ౪. దృష్టుల, ౫. రతిని, ౬. పరపగా (ర; రి) రా (గా) వె, ౭. ల, ౮. పలుద్రోవలనువృథా, ౯. వె. ౧౦. తలఁపు, ౧౧. తస్థైర్యా, ౧౨. మనను, ౧౩. లు,

నిల దురాలాపవశేచ్ఛమైఁ జెడఁగ
పలుకు లనర్పిత భ్రమితాభిరతిని?
గావున బసవలింగ[౧]ము భవ్యదేవ-
భావ మచ్చోత్తవే భక్తేంద్రియముల”
నని ప్రలాపించుచు, వనరుచు, శోక-
వనధిఁ దేలుచు, భక్త-వర్గంబుఁ దాను
లింగార్చనములు సెల్లించుచుఁ జెలఁగి,
మంగళారతు లెత్తి మహిత తదియ్య-
లింగగర్భమున సల్లీల నొప్పా[౩]రు
భంగిగా బసవన్న భావంబు దోఁపఁ
గనుఁగవ హర్షాశ్రు కణములు దొరుఁగఁ
దనువున రోమాంచతతు[౪]లుఁ దలిర్పఁ
గంధర[౫]సీమ గద్గదిక నెక్కొనఁగ
బంధురానంద విభ్రాంతిఁ బండితుఁడు
గనువిచ్చి చూచుచుఁ, గరమర్థి మ్రొక్క-
చును, భజింపుచు, నభిష్టుతులు సేయుచును,
“నీమూర్తి యస్మదియేష్టలింగము మ-

౧. వె, ౨. మదయదేవ; ము దివ్యదేవ, ౩. ౪. ౫. ఉల్లసిల్ల, ౬. మనను గద్గదము,

హామూర్తి¹ యైన వృషాధీశుమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశు దివ్యప్ర-
భామయం బగు వీరభద్రేశుమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశులీలాభి-
రాముఁ¹డై చను మహాప్రమథేంద్రమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశు నిజాంగ-
ధామమై చను ప్రసాదస్ఫూర్తిమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశుండు దాన
కామించి యైన జంగమలింగమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశు గర్భమున
నేమించి వెలుఁగెడు నిజలింగమూర్తి,
యీమూర్తి యస్మదియ్యేశు ననన్య-
సామాన్యమై చను సద్గురుమూర్తి
యీమూర్తి యస్మదియ్యేశుండు బసవ-
నామంబుఁ దాల్చిన నందీశమూర్తి,
యీమూర్తి భావించు నింతన భవభ-
యామయ దుఃఖాతురాదు లడంగు,
నీమూర్తిఁ గైకొను నింతన యైహి-

¹. మై.

కాముష్మికాదిసౌఖ్యములు వ[1]ట్రిల్లు,
నీ[2]మూర్తి నుతియించు నింతన భక్తి-
భామా[3]వలోకనపదవి సిద్ధించు”
ననుచు శ్రీబసవదండాధీశు మహిమఁ
గొనియాడుచును జగద్గురుఁడు వండితుఁడు
సద్భక్తవరులును శంకరయ్యయు మ-
హాద్భుతాక్రాంతాత్ములై యుండి రంత;
జంగమ శ్రీపాద జలజ[4]పరాగ,
జంగ[5]మరోహణాచలపద్మరాగ,
జంగమారాధనాక్రాంతానురాగ,
జంగమసంచిత [6]శ్లాఘా[7]నురాగ,
జంగమాభీష్ట పూజాబహిర్యాగ,
జంగమధ్యాన నిశ్చలితాత్మయోగ,
జంగమసౌఖ్యాభిసంతతోద్యోగ,
జంగమాజ్ఞాంకుశ చర మదనాగ,
జంగమలబ్ధ ప్రసాదోపభోగ,
జంగమాశీర్వాద శతమహాభాగ,

---

౧. ర్ధి, ౨. ద, ౩. ను, ౪. ప్రకార, ౫. మా, ౬. శ్లోకా, ౭. ఖియో.

యఱలేనిసఖుఁడ ! సూరార్య ! నాముద్దు-
మఱఁది ! వి న్నిది మహిమప్రకరణము.

గద్య

ఇది యసంఖ్యాత మాహేశ్వరదివ్య-
పదపద్మ సౌరభ భ్రమరాయమాణ-
జంగమలింగ ప్రసాదోపభోగ-
సంగత సుఖసుధా శరధినిమగ్న-
సుకృతాత్మ పాలకురికిసోమనాథ-
సుకవిప్రణీత భాసురతర దండి-
నాయక బసవాంకన ఖ్యాతగుణ గ-
ణాయతకీర్తి దిగంత త్రిలోక-
గురుపండితారాధ్యచరితంబునందు
గరముఁ జతుర్థప్రకరణ మొప్పారు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---